## గంటల పంచాంగం

విరోధి సం॥ చైత్ర శు॥ దశమి 1949 సం॥ ఏప్రిల్ 8 శుక్రవారం సూర్యోదయం ఉ 2.19 పుష్య ప 11 40 వర్జ్యం రా 11.16 ల 12.46 వు.

శు॥ ఏకాదశి ఏప్రిల్ 9 శనివారం ఏకాదశి రా 11.33 ఆశ్లేష ప 9.42 వర్జ్యం రా 8.37 ల 10.4 వు.


# ఆంధ్రపత్రిక

విరోధి సం॥ చైత్ర శు॥ దశమి
శుక్రవారం


## క్రొత్త మంత్రివర్గం

"ప్రధాని మారినంతమాత్రమున ప్రభుత్వ విధానము మారవలసినది లేదు. వెనుకటి ప్రధానిగాని, ఇప్పటి ప్రధానిగాని అందరు ఆ మహాసంస్థ కాంగ్రెస్‌కు చెందినవారే. ఆ సంస్థ విధానము, కార్యక్రమము నిర్దిష్టమైనవి. ఇదివరకు పూర్వమే నిర్ణయమై యున్నవి." అని రాష్ట్ర నూత్న ప్రధాని శ్రీ కుమారస్వామి రాజాగారు ప్రమాణపూర్వకముగ మొన్న అధికారము స్వీకరించిన అనంతరము చేసిన ప్రకటన కేవలము లాంఛనముగనే కన్పించినప్పటికిని, రాష్ట్ర రాజకీయధోరణిని కొంతవరకు సూచించుచున్నదని చెప్పవచ్చును. నాయకత్వమునందు గత మూడు సంవత్సరములుగ జరుగుచున్న మార్పులు ఒకవిధానమును అనుసరించిగాదని శ్రీ కుమారస్వామి రాజాగారి ప్రకటన ధ్రువపర్చుచున్నది. శ్రీ ఓ. పి. రామస్వామి రెడ్డియార్ శాసనసభా కాంగ్రెస్ పక్ష నాయకత్వపు ఎన్నిక పోటీనుండి విరమించుకొనుచు చేసిన ప్రకటన ఉదాత్త భావములతో, ఉన్నతాదర్శములతో నిండి నిష్కృతమైయున్నను రెండు సంవత్సరముల క్రితము వారి ఎన్నిక, నేడు వారి నిష్క్రమణ ఒక విధానమును అనుసరించి జరుగలేదని స్పష్టము చేసినది. 1946 లో జరిగిన మొదటి ఎన్నికనాటికి 1949 లో జరిగిన నాల్గవ ఎన్నికనాటికి రాష్ట్ర రాజకీయములు ఎట్టి మార్పు చెందలేదని ధ్రువపడినది. అనాడేర్పడిన మార్గమునే మంత్రివర్గ నిర్మాతలు, ఈనాటికిని అనుసరించుచున్నందుననే రాష్ట్ర పరిపాలన నానాటికి అధ్వాన్నమగుచు, రాష్ట్ర సమస్యలు క్లిష్టమగుచు వచ్చినవి. ఈ విపరిణామమునకు రాష్ట్రశాసనసభల కాంగ్రెసు పక్షము, రాష్ట్ర కాంగ్రెసు సంఘములు సమబాధ్యతను వహింపవలసియున్నది.

ఇటీవల జరిగిన ఎన్నికకు ముందు శాసనసభా కాంగ్రెసుపక్షమునందలి వివిధవర్గములు సమాధానము కుదుర్చుటకు పెద్దలు తీవ్ర, గీఢ సంప్రతింపులు జరిపినవి. అన్నివర్గములకు సమ్మతమైన వ్యక్తి లభించనందున పోటీ అనివార్యమైనది. పోటీ అనంతరమైనను నెగ్గిన, ఓడిన పక్షములు సమాధానమునకు వచ్చుటకు అవకాశము ఉండెను. కాని, మంత్రివర్గమున సన్యక్తికి స్థానమివ్వవలెను? ఓడిన మండలలో ఎవ్వరిని [illegible]? అను ప్రశ్నలే ప్రధానముగ నుండి మరల తిరిగి ప్రతిష్టంభన మేర్పడినది.

సభ్యులు మూడవవంతు కాంగ్రెసు అభ్యర్థులుగ ఎన్నికైరి. ఎన్నికల సమయమున అభ్యర్థులకు గాక సంస్థకు ప్రాధాన్యమిచ్చిరి. అది సబబైన పద్ధతే. కాని ఎన్నికలైన అనంతరము సంస్థ అప్రధానమై వ్యక్తులు ప్రధానమైరి. సంస్థ లక్ష్యములు గాక వ్యక్తులఆశయములు ప్రభుత్వ విధానమును, పరిపాలనాధోరణిని నిర్ణయించుట జరిగినది. దాని ఫలితము ఎట్లుండెనో రాష్ట్ర ప్రజలు గత మూడుసంవత్సరములుగ ప్రత్యక్షముగ అనుభవించిరి. ప్రజలు మార్పును వాంఛించి యుండవచ్చును. కాని ఆ మార్పు మంత్రివర్గమునందుగాక, ప్రభుత్వ విధానమునందు వ్యవహార పద్ధతులందే. అట్టి మార్పులను తెచ్చుటకు ఇంతవరకు ఎవ్వరును ప్రయత్నింపలేదనియే చెప్పవచ్చును.

శ్రీ కుమారస్వామి రాజాగారి మంత్రివర్గమునకు ఆ విధముగ హెచ్చు బాధ్యతలు ఏర్పడినవి. పూర్వపు పరపతిని మార్చి పరిపాలనమును నూత్నదృక్పథముతో వీరు కొనసాగింపవలెను. యథార్థమునకు ప్రజలకు మంత్రులెవరైనను; ఒక్కటే. వారు తమ యవసరములను తీర్చుటకు ఎట్టి ప్రయత్నములను చేయుచున్నారు? తమ న్యాయమైన కోర్కెలను మంత్రులు మన్నించుచుండిరా? అధికారుల 'జులుం' తగ్గినదా? లంచగొండితనము నిర్మూలనమైనదా? వీటినిగురించియే ప్రజలు విచారించుచుందురు. ఇట్టిసమస్యల పరిష్కారమునకు మంత్రులకు ప్రజలలో గల పలుకుబడి, ప్రాబల్యముగాక ఋజువర్తనము, సామర్థ్యము, వ్యవహారదక్షతఅవసరము.

శ్రీ కుమారస్వామి రాజాగారు తమ మంత్రివర్గమును విస్తృతము చేయునపుడు ఈ విషయములను గమనింతుమని ప్రకటించుట హర్షింపతగ్గ విషయము. కాని తాము వెనుకటి మంత్రివర్గ విధానమునే అనుసరించెదమని చేసిన ప్రకటన నిరుత్సాహ జనకముగనున్నదని చెప్పవలెను. విద్య, కులముల ప్రాతినిధ్యము, అదనపు పన్నుల విధింపు, ప్రాంతీయావసరములను గమనించి ఆ ప్రకారముగ సాగు సౌకర్యములు విద్యుచ్ఛక్తి సరఫరా ఏర్పాట్లుచేయుట, మున్నగు ప్రధాన విషయములలో ఇంతవరకు రాష్ట్ర ప్రభుత్వము అనుసరించిన విధానము తీవ్ర విమర్శకు గురి యగుటేగాక, రాష్ట్ర ప్రజలకు అసంతృప్తిని కల్గించెను. ఆ విధానములను పూర్తిగ మార్పు చేయవలసిన యవసరము గలదు.

అన్ని కంట్రోల్సును అమలు జరుపుటయందును, కంట్రోలు సరుకులు, ఏ కొందరికో మాత్రమే గాక, సామాన్య ప్రజ లందరికి వారి యవసరములకు తగినట్లు, కంట్రోలు ధరలకు లభించునట్లు చూడవలసి యున్నది. ప్రభుత్వంపై ప్రజలకు అసంతృప్తి ఏర్పడుటకు, అధికారులలో లంచగొండితనము ప్రబలుటకు ఈకంట్రోల్సు సక్రమముగ అమలు కాకపోవుటే.

అధికార దర్పనిరోగము కూడ హెచ్చుగనున్నది. మంత్రులును, శాసనసభా సభ్యులును ఐకమత్యముగ రాష్ట్ర ప్రజల క్షేమము, అభివృద్ధికి కృషి చేయుటే తమ పరమలక్ష్యముగ పెట్టుకొని పనిచేసిన అట్టివారు ఎన్నడైనను ప్రజాభిమానమును, ప్రజల మన్ననలను పొందగలరు. రాష్ట్ర నూతన మంత్రివర్గము, ఆ [illegible] అధికారిస్థానముల ప్రతిష్ఠ శాసనసభ [illegible]

సభ్యులు ఇష్టులై వ్యవహరింతురని, రాష్ట్రవిభజన జరుగనున్న ఈసమయమున, ఉన్న విభేదములు వృద్ధి చేయుటకు శిథిలావస్థలో నున్న పరిపాలనా యంత్రమును శిథిలము చేయుటకుగాక, అన్ని వర్గముల మధ్య సామరస్యమును ఏర్పరచుటకు, రాష్ట్రమును "స్వపరిపాలన" "సుపరిపాలన" గ మార్పు చెందించుటకు కృషి చేయుదురని విశ్వసించుచున్నాము.

## క్షయపరిశోధన ఆస్పత్రి

### పటేల్ శంకుస్థాపన

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: ఢిల్లీవిశ్వవిద్యాలయములో క్షయనివారణసంస్థకు నేడుదయం సర్దార్ పటేల్ శంకుస్థాపనచేసిరి. ఈ సంస్థలో క్షయరోగమును గురించి వైద్యవిద్యార్థులకు బోధించుటయేగాక పరిశోధన మొనర్చుటకుకూడా ఏర్పాట్లు జరుగుచున్నవి. ఈ సందర్భమున పటేల్ ప్రసంగించుచూ, మానవులకు దుష్టశత్రువైన క్షయరోగమునకు ఒక మంచి లక్షణము మాత్రమున్నదనిరి.

గ్రామాదులలో నివసించు వారికంటె నాగరిక జీవనము గడుపుచున్న వారినే అది అధికముగా పరామర్శించును. క్షయ అంటకుండా జాగ్రత్తవహించు విధానమును ప్రజలలో ప్రచారముచేయుట కూడా వైద్యములో సమానముగా ముఖ్యమైనదేనని చెప్పిరి. శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ గారు అధ్యక్షత వహించిరి.

## కాదింశీకులకు కార్మికులకు పోతయిండ్లు ఆదర్శప్రాయమైనవి

లండన్, ఏప్రిల్ 6: బీహార్ సంయుక్త రాష్ట్రాల, పబ్లిక్‌వర్క్సు మంత్రి అగ్నిభోజ్ గారు, లండన్‌లోని పోతయిండ్ల (ప్రెఫ్యాబ్రికేటెడ్ హౌసెస్) నిర్మాణ కర్మాగారము దర్శించి, భారతదేశంలో యీ ఇండ్లను ఉపయోగిస్తే, ప్రస్తుతం కాందిశీకుల, కార్మికుల గృహవసతి సమస్యను చాలవరకు పరిష్కరించవచ్చునని అభిప్రాయం తెలియజేశారు.

"ఈ ఇళ్లు ఎవరికైనా కూడా చాలా సౌకర్యంగా ఉంటాయనుకుంటున్నాను. భారతదేశంలో, కాందిశీకుల, కర్మాగార కార్మికుల కోసం తయారుచేసినవి. ఒక్కొక్క యింటిలో మూడు విడిగదులు, వంటిల్లు, స్నానాలగది, అన్నీ ఒకచట్రంలోనే అమర్చి ఉన్నాయి.

భారత దేశంకోసం ఉద్దేశించేట్లయితే ఈ యిళ్ల తయారులో కొద్దిగా కావలసిన మార్పులు చేసికోవలసి ఉంటుంది. మనం వేసవికాలం ఎక్కువ వేడిగా ఉంటాం కాబట్టి కప్పు ఉన్న వసారా కూడ ఈ నమూనాకు కలుపుకోవలసి ఉంటుంది. బ్రిటనులో కన్న మన ఇండ్లకు గాలి సౌకర్యాలు ఎక్కువ అవసరము.

ఈ యిళ్లకు సగటున ఒక్కొక్కటి 5000 రూపాయలకు మించి ఉండదు.

ఒక్క బీహారుకే ఇప్పుడు ముందు 5000 ఇళ్లు కావలసి ఉంటాయి. తర్వాత ఏడాదిలోగా 10000 ఇళ్లదాకా సమకూర్చుకోవలసి ఉంటుంది.

నాకీ యిళ్లు చాలా నచ్చాయి. దీని విషయం, బీహారు ప్రభుత్వానికి నివేదిస్తాను. ప్రభుత్వమే తుదినిర్ణయం చేయవలసి ఉంటుంది." అని అగ్నిభోజ్ గారు అన్నారు.

"ఇండియాలోని ముడిపదార్థమే వాడి అక్కడ స్థానికంగా బ్రిటిష్ ఫ్యాక్టరీ ఉండి ఈ యిళ్లు సరఫరా చేయగల్గితే బాగుంటుంది. ఫ్యాక్టరీ నిర్మించటంలో ముందు మొదటి యిల్లు తయారయ్యేటప్పటికి, ఒక అర్ధసంవత్సరం కాలయాపన కావచ్చును. కాని పని మొదలయ్యాక, 15, 17 రోజులకే ఇల్లు తయారవుతుంటాయి" అని అగ్నిభోజ్ గారన్నారు.

అగ్నిభోజ్, సిడ్నీలో జరిగిన అంతర్జాతీయ కార్మిక సమావేశంలో పాల్గొనేందుకు యూరప్ వచ్చారు. బ్రిటన్‌లోని పరిశ్రమలను సందర్శిస్తూ నడిచారు. పారిస్ వెళ్లి అక్కడనుంచి స్విట్జర్లాండు పరిశ్రమాగారాలను సందర్శించి ఏప్రిల్ 25 కి ఇండియాకు తిరిగి వస్తారు.

## ఫ్రాంకో స్పెయినుకు అమెరికా ద్రవ్యసహాయము

లండన్, ఏప్రిల్ 6: ఫ్రాంకో స్పెయినుకు అమెరికా ద్రవ్యసహాయము గావింప సన్నద్ధమగుచున్నది. అమెరికా స్పెయినుకు పడిలులు [illegible] 'డెయిలీ గ్రాఫిక్' నేడు వ్రాసినది. ఈ ద్రవ్యమును స్పెయిను రవాణా సౌకర్యములకు, విద్యుచ్ఛక్తి సౌకర్యములకు వృద్ధి చేసికొనుటకు ఉపయోగించుకొనును.

## "బొంబాయిలేని మహారాష్ట్రం స్వీకరింపము"

### హెచ్. వి. పటాస్కర్ ప్రకటన

బొంబాయి, ఏప్రిల్ 6: థార్ కమిటీలోని ఒక మెంబరుగా ఉండినటువంటి హెచ్. వి. పటాస్కరుగారు మహారాష్ట్ర కాంగ్రెసువాదుల తరఫున యీ క్రింది రీతిగా తమ అభిప్రాయమును వెల్లడించిరి.

బొంబాయి నగరము మహారాష్ట్రములో చేరియుండవలెను, అట్టి మహారాష్ట్రమును మహారాష్ట్రీలు స్వీకరింపజాలరు. బొంబాయినగరమును మినహాయించుట మహారాష్ట్రీలకు చాలా విషాదకరమైనవిషయము. మహారాష్ట్రమునుగాని, మహారాష్ట్ర నుజంటగాని ఇప్పుడు నిర్మాణముకావాలకపోవచ్చును. కాని బొంబాయి నగరము విషయములో అగ్రనాయకత్రయ కమిటీ అట్టి అభిప్రాయమును వెల్లడించుట ఎంతమాత్రమూ భావ్యం కాదు. ఈ బొంబాయినగర విషయమును అఖిలభారత కాంగ్రెసు కమిటీ తిరిగి పరిశీలించి న్యాయమైన నిర్ణయము చేయగలదని ఆశించుచున్నాను. విదర్భయున్నా నాగపూరున్నా మహారాష్ట్రములో చేరవలెనను విషయమైపట్టుదల మున్నుబల్ల మహారాష్ట్ర నిర్మాణము త్వరలో జరుగక చాలా కాలహరణము కావచ్చుకనుక, నాగపూరు, విదర్భవిషయమైన ప్రస్తావన ఇప్పుడు చేయకుండా విడిచిపెట్టుట ఉత్తమమని నా అభిప్రాయము. బొంబాయినగర సమేతమైన మహారాష్ట్రము నిర్మాణముకొరకై మహారాష్ట్రీలు తీవ్ర ప్రయత్నము చేయవలెను.

భాషారాష్ట్ర నిర్ణయ నివేదికను విమర్శించి పరిశీలించుటకై బొంబాయి అసెంబ్లీలోని మహారాష్ట్ర సభ్యుల సమావేశము రేపుజరుగును.

## 15 వ తేదీన రాష్ట్ర కాంగ్రెస్ కమిటి చర్చ

బొంబయి, ఏప్రిల్ 6: కాంగ్రెస్ అగ్రనాయకత్రయ కమిటీ నివేదికదృష్ట్యా, భాషాప్రయుక్తముగా మహారాష్ట్రమును ప్రత్యేకరాష్ట్రముగా నిర్మించే సమస్యను గురించి, మహారాష్ట్ర కాంగ్రెస్ కమిటీ ఏప్రిల్ 15 న మహాబలేశ్వర్‌లో సమావేశమై చర్చిస్తుంది. కాంగ్రెస్ కార్యదర్శి శంకర్రావుదేవ్ గారుకూడా యీ సమావేశమునకు హాజరుకావచ్చును.

## పార్లమెంటు సమావేశం 9 వ తేదీతో సమాప్తి

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: పార్లమెంటు సమావేశం నేడు సాయంకాలం ముగియుటకుముందు పండిట్ జవహర్లాల్ నెహ్రూగారు ప్రస్తుత పార్లమెంటు సమావేశము ఏప్రిల్ 9 వ తేదీతో ముగియునని ప్రకటించినారు. అసలు సమావేశమును రేపే ముగించవలెననుకున్నారు కాని ఇంకనూ 18 శాసనములు చర్చించవలసినవి యున్నందున అట్లు చేయజాలకపోయిరి. ఈరెండు రోజులు ప్రశ్నలు వేయుట జరుగదు. పూర్తిగా శాసనములపై చర్చజరుగును.

## నిమ్నజాతుల సమావేశం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: అఖిలభారత నిమ్నజాతి 12 వ వార్షిక సమావేశం గ్వాలియర్‌లో ధర్మప్రకాష్ గారి అధ్యక్షతక్రింద మే 7, 8 తేదీలలో జరుగును. కార్మికశాఖామంత్రి శ్రీ జగజీవనరాం గారు ప్రారంభోపన్యాస మిచ్చెదరు. శ్రీ జగజీవనరాంగారి అనారోగ్య కారణంగా ఏప్రిల్ 9, 10 తేదీలలో జరుగదు.

## ప్రపంచ పరిషత్తు

బొంబాయి, ఏప్రిల్ 6: 1950 సం॥లో సమావేశము కానున్న ప్రపంచరాజ్యాంగ సమితి భారతదేశంలో జరుగవచ్చునని, దాని కార్యకర్తసంఘ అధ్యక్షుడు హెన్రీ ఆసోస్బోన్ గారు తెలియజేసిరి.

## వెండి బంగారు ధరలు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: కిశోరీ మోహన్ త్రిపాఠిగారి ప్రశ్నకు సమాధానమిస్తూ డా॥ మత్తాయిగారు పార్లమెంటులో ఈ విషయముగ చెప్పిరి. మార్చి 31 తేదీన బొంబాయి మార్కెటులో బంగారం ధర రు 295-5-4. వెండి రు. 4-10-4. ఇది ఔన్సు 1 కి ధర. అమెరికా ట్రెజరీ బంగారు ధర రు. 116-12-9. బ్రిటను ట్రెజరీ ధర రు. 114-13-1 న్యూయార్కులో వెండి ఔన్సు అధికార ధర రు 2-5-0. లండను లో రు 6-8-0. ఇండియాలో మాత్రం ధరలపై కంట్రోలులేదు. కాని బయటికి పంపుటకు మాత్రం ధరల కంట్రోలు ధర ఉన్నది.

ఈ ధరల తారతమ్యమును కంట్రోలు చేసెదరా అను ప్రశ్నకు సమాధానముగ పరిస్థితిని ఎప్పటికప్పుడు గమనిస్తున్నామని మాత్రము మత్తాయిగారుసమాధానమిచ్చిరి.

## 1951 నాటికిఇండియా స్వయంపోషకం కావాలి

### వ్యవసాయ శాస్త్రజ్ఞులకు జయరాందాస్ హెచ్చరిక

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: "మన దేశానికి కావలసిన ఉన్న సూటికి 10 వంతుల ఆహారమును 1951 నాటికి మనంతట మనమే ఉత్పత్తిచేసికోగలుగుట అసంభవమని అనుమానించేవారి సందేహాలను పార్రద్రోలుటలో ప్రభుత్వమునకు మీరు సహాయపడవలసియున్నది.

ఈ కార్యక్రమమున కడ్డువచ్చే చిన్నచిక్కులను పెద్ద ప్రయత్నములతో ఎదుర్కొనవలెను. 1951 నాటికి ఏదో లక్ష్యమును మనం చేరుకొనునట్లు వీరు వివిధ అనుసరణముద్వారా నూత్న మార్గములను, పద్ధతులను సూచించవలెను." అని ఆహారశాఖామంత్రి జైరాందాస్ దౌలత్‌రాం నేడిచ్చట భారత వ్యవసాయ పరిశోధనాలయములో వ్యవసాయశాస్త్రజ్ఞులసమావేశమును ప్రారంభించుచు హెచ్చరించెను.

వ్యవసాయ పరిశోధనను శాస్త్రీయమార్గములలో సాగించుటకు శాస్త్రజ్ఞులు కృషిచేయవలెనని, పరిశోధనవలన వ్యవసాయశాస్త్రము అభివృద్ధిపొందుటేగాక, దానికి సంబంధించిన అనేక వాస్తవిక సమస్యలుకూడ పరిష్కృతమగునని జైరాందాసు ఆశించెను.

ఆయన ఇంకా ఇట్లనెను.

"మీరు చేయవలసినది చాల ఉదాత్త కార్యము. ఎందువల్లననగా భారతదేశంలోని సామాన్య పౌరుని సేవించుటకు మీకు అనేకావకాశము లున్నవి. ప్రజానీకపు జీవన ప్రమాణము ఎక్కువ చేయుటే మన జాతీయ ప్రభుత్వపు ప్రధానాశయమని మీ రెరుగుదురు. ఈ ఆశయమును అతి త్వరగా, అతి సమగ్రముగా నిర్వహింపవలసి యున్నదనీ, ఇదిగాక ఇంకా మన కనేక సమస్య లున్నవనీ కూడ మీ రెరుగుదురు. 1951 నాటికి మన ఆహార లోపమును పూరించవలెనని ప్రభుత్వము కృత నిశ్చయమై యున్నది. ఈ నిశ్చయమును సాధించుటలో మీరు శాయశక్తులా కృషిచేయ వలసియున్నది.

ప్రజల స్వల్ప జీవన ప్రమాణము మాట అటుంచి, ఆ స్వల్ప ప్రమాణమును నిలబెట్టుటకు గూడ, అనగా వారికి అత్యవసరమైన తిండి, గుడ్డ, నివాసము నిచ్చుటకు గూడ మనము తక్షణమే కృషిసలుపవలసి యున్నది. అందుకనే విజ్ఞాన పరిశోధనల లాభములు ప్రజానీకము కంతటికీ అందుబాటులో నుండునట్లు మనము ప్రయత్నించుచున్నాము.

కనుక వ్యవసాయము, అరణ్యములు, నీటి పారుదల, జలపాత విద్యుచ్ఛక్తి, చేపల పరిశ్రమ, ఉద్యానవనములు, మున్నగువాని నన్నిటినీ ఏకైక విధానములో అభివృద్ధిగావించి, దాని లాభములు మన తరమునకేగాక మన తరువాతి తరములకుగూడ చెందింపవలసియున్నది."

నేడు ప్రారంభమైన ఈ సమావేశము 9 వ తేదీవరకూ సాగును. సమావేశములో పాల్గొన్న శాస్త్రజ్ఞులు మరింత భూభాగములో ఆహారపు పైర్లను వేయుట, నవీన పరికరములతో సాగుచేయుట, బలమైన విత్తనములను అభివృద్ధిచేయుట, భూసారము నెక్కువచేయుట, భూసార పరిశోధన, నీటి పారుదల, పైర్లకు కలుగు తెగుళ్ళను నివారించుట మున్నగు సమస్యలపై చర్చలు జరిపెదరు.

## భారత విమానదళమునకు మరికొన్ని వాంపైర్ జట్ ఫైటర్లు

లండన్, ఏప్రిల్ 6: భారతవిమానదళమునకు త్వరలో మరికొన్ని వాంపైర్ జట్ ఫైటర్లు (పోరాట విమానములు) చేకూరును. ఈ రకపు విమానములను బ్రిటిష్ పాత్రికాయులను డీహావిల్లాండ్ కంపెనీ వారు తయారుచేయుచున్నారు. "భారత ప్రభుత్వముతో మేము గావించుకొన్న కంట్రాక్టును కాలాతిక్రమములేకుండ నెరవేర్చెదము. వెంటనే, దాదాపు రెండు మాసములక్రిందట మా వారు వాంపైర్లను మేము అందజేసితిమి. తక్కినవానిని డిలివరీ యిచ్చుటకుయింకను రాలేదు. ఇండియా ప్రభుత్వమువారు ఆర్డరిచ్చిన విమానములన్నియు సకాలమున సిద్ధమగును." అని కంపెనీ ప్రతినిధి యొకడు నేడు చెప్పెను.

ఈ కంపెనీవారు డెలివరీయిచ్చిన వాంపైర్ విమానములను నడిపిచూడగా అవి చక్కగా నడిచెనని, అవి అత్యంతలోపరహితముగా నుండెనని, వానికి మరమ్మతులు అంతగా అవసరము లేక పోయెనని భారత విమానదళ ప్రధానాధికారి కంపెనీ వారికి వ్రాసినలేఖవల్ల తెలియుచున్నది.

## భారతదేశములో గోధుమపైరు

### 1948-49 లో 100-కి 7.8 వంతులు తగ్గుదల

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: భారతదేశమునందు 1948-49 సం॥ములో 1,84,13,000 ఎకరములలో గోధుమనాటిరి. 1947-48 సం॥ములో 1,99,86,000 ఎకరములం నాటియుండిరి. అనగా 1948-49 లో గోధుమనాటినమేర 100-కి 7.9 వంతులు తగ్గెను. వ్యవసాయశాఖలో సంఖ్యాగణనశాఖ, లెక్కల శాఖవారు తయారుచేసిన లెక్కల అంచనాలవల్ల ఈ విషయము తెలియుచున్నది. సి. పి. బేరారు, బొంబాయి, మధ్యభారత, పాటియాలా, తూర్పు పంజాబు సంస్థానములలో నాట్ల సమయమున వాతావరణము అనుకూలముగా నుండక పోవుటచేత తక్కువ మేరలో గోధుమ నాటవలసి వచ్చెను. ఈ లెక్కల అంచనా 1948 సం॥ అంతమునవరకుకేకా 1949 సం॥ జనవరి ప్రారంభమువరకుసై యున్నది. అప్పటివరకు పైరులు మొలకెత్తి బాగుగానే యుండెను. బొంబాయిలో కొన్ని ప్రాంతములలో మాత్రము గాలివానకల్ల తెగులువల్ల పైరు అంత బాగా లేకుండెను.

## ప. బెంగాలులో అండమాన్ దీవుల సమైక్యం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: పశ్చిమబెంగాలు రాష్ట్రంలో అండమాన్, నికోబార్ దీవులను సమైక్యం చేయవలసిందని సూచిస్తూ పశ్చిమబెంగాలు ప్రభుత్వం వారు కేంద్రప్రభుత్వంవద్దకు రాయబారం వచ్చివారా అని అడుగగా లేదని సర్దార్ పటేల్‌గారు నేడు పార్లమెంటులో చెప్పిరి.

### భారతజాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ద్వితీతా మహాసభ

విజయవాడ, ఏప్రిల్ 4: భారత జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ద్వితీయ మహాసభ మే నెల 5, 6, 7, 8, 9, తేదీలలో ఇండోర్‌లో జరుగును. దీనికి ఆంధ్రశాఖ పక్షాన ప్రతినిధులను పంపవలసి యున్నది. కొబట్టి ప్రతి అనుబంధ సంఘంలోను మొదటి 250 మంది ప్రాథమిక సభ్యులకు ఒక ప్రతినిధిని ఆపైన 250 నుండి 500 వరకు ఇద్దరు ప్రతినిధులను ఆపై ప్రతి 500 మంది ప్రాథమిక సభ్యులకు ఒక్కొక్క ప్రతినిధి చొప్పున ఎన్నుకోవలెను. తీర్మానాలు ప్రతులు యీ నెల 20 లోగా ఆంధ్రశాఖ కార్యాలయానికి చేరవలెను. అని ఆంధ్రశాఖ ప్రధానకార్యదర్శి కాకరాల కామేశ్వరరావు వ్రాసెను.

### విడిది గృహముల రిజిస్ట్రేషను రుసుము హెచ్చింప వీల్లేదు

చెన్నపట్నం, ఏప్రిల్ 6: విడిదిగృహములను రిజిస్ట్రేషను చేయుటకు చెల్లించవలసిన రుసుము ప్రస్తుతము పాలువు రూ. 5 నుండి 50 వరకు నిర్ణయమైయున్నది తమ చాలుట లేదని ఆ రుసుమును పెంచుటకు అనుమతించవలెనని ప్రభుత్వమునకు మదరాసు కార్పొరేషనువారును యితర మునిసిపాలిటీలనారు వ్రాసిరి. విడిది గృహముల రిజిస్ట్రేషను రుసుము పెంచవలసిన కారణమేమీ తమకు గోచరించలేదని ప్రభుత్వము ఉత్తరవు జారీచేసినది. ఈ ఉత్తరవు తిరుచినాపల్లి, విజయవాడ, మధుర, తంజావూరు, కాలికట్టు, విశాఖపురపాలక సంఘాలకు కూడా తెలియచేయబడెను.

### సోడాబుడ్లలో సారాయి

చెన్నపట్నం, ఏప్రిల్ 6: చింతాద్రిపేట స్వామినాయకన్ వీధిలో నొక సోడా అంగడియందు సారాయమును సోడా బుడ్లలో పోసి సోంగ చీటిఅంటించి లోగనాథన్ అనే అంగటి స్వతవారు అమ్మకమునకై యుంచియుండుట కనుగొని పోలీసులు వానిని నిన్న అరెస్టు చేసిరి.

### ఉద్యోగ వార్తలు

మదరాసు, ఏప్రిల్ 6: లేబరు డిపార్టుమెంటు ఫస్టు అసిస్టెంటు సెక్రటరీ అదే డిపార్టుమెంటులో అడిషనల్ డిప్యూటీ సెక్రటరీగ శ్రీ వి. అలగిరిస్వామి స్థానే నియమించబడిరి.

డిప్యూటీ కలెక్టరు ఆర్. ఆర్. విశ్వాసము 2 నెలలు శలవొసగబడిరి.

డి. కలెక్టరు యస్. శంకర నారాయణన్ అవసరముగ ఒకనెల శలవొసగబడిరి.

శ్రీ జి. వి. రంగారెడ్డి బళ్లారి నుండి రామనాథపురం, యం. వి. యస్. జమీ పాకేట్ రామనాథపురంనుండి బళ్లారికి బదిలీ చేయబడిరి.

### గమనిక

ఏప్రిల్ 6 వ తేదీ ఆంధ్రపత్రిక 2 వ పేజీలో శ్రీరామ క్రమపు రసనతనవరాత్రి ఉత్సవం వార్తలో ఆక్రమవ బునకు దాదాపు రెండులక్షల రూపాయలు విరాళములు వసూలైనవని పొరపాటున ప్రకటనది. వసూలైనమొత్తం రూ 25 వేలు మాత్రమే.

## హిందూస్తానీ సంగీత విద్యాపీఠం

### లక్నోలో స్థాపన

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: భారత ప్రభుత్వం యు. పి. ప్రభుత్వ సహకారంతో లక్నోలో హిందుస్తానీ సంగీత విద్యాపీఠమును స్థాపించియున్నది. దీని నిర్వహణను పరిశీలించుటకుగాను, కేంద్ర ప్రభుత్వ ప్రతినిధులు, యు. పి. ప్రభుత్వ ప్రతినిధులు, హిందూస్తానీ సంగీతం బోధించుచున్న అనేక యితర సంస్థల ప్రతినిధులతో ఒక సంఘం నియమించబడింది. ఈ సంఘంవారు యిటీవల లక్నోలో సమావేశమై హిందూస్తాని సంగీతంలో పరిశోధన కార్యకలాపానికి ప్రత్యేకంగా ఒక శాఖను ఏర్పాటు చేయుటకు నిర్ణయించారు. హిందుస్తానీ సంగీత పాఠశాలలన్నిటిలోను, 'పోస్టు గ్రాడ్యుయేటు' తరగతులను నడపవలెననీ, దేశంలో హిందూస్తానీ సంగీతం నేర్పు సంస్థలన్నిటిని దీనికి అనుబంధం చేసుకొనే అధికారం ఉండాలనికూడ నిర్ణయించారు

## బీహారు జమీందారీ రద్దుబిల్లు

### తిరిగి విచారించాలని శాసన సభకు గవర్నరు సందేశం

పాట్నా, ఏప్రియల్ 6: బీహారు శాసనసభకు, తిరిగి బీహారు జమీందారీ రద్దుబిల్లు, కేంద్ర ప్రభుత్వ పరిశీలనానంతరం నేడు అందజేయబడినది. దానితో పాటు, "ఈశాసనసందర్భమున హోంశాఖామంత్రి వర్గంవారి 28 వ మార్చి తేదీ గల లేఖలో తెలుపరచిన సూచనలు సభవారు తిలకించెదరని ఆశించుచున్నాను." అని బీహారుగవర్నర్, ఎం. ఎస్. అణీగారు వ్రాసిన లేఖను కూడ శాసన సభాధ్యక్షులు సభ వారికిచదివి వినిపించిరి.

ఇందుపై మార్చి 28, 1949 తేది గల గవర్నర్ జనరల్ రాజగోపాలాచారిగారి సందేశమును కూడ అధ్యక్షులు సభవారికి చదివి వినిపించిరి.

"నా అభిప్రాయము కొరకు పంపబడిన ఈ బిల్లును తిరిగి సభవారికి అందజేయుచున్నాము. ఇందుతో జతపరచి వున్న సూచనలను సభవారు ఆలోచింపగలరని ఆశించుచున్నాము." అని ఆ సందేశమునందున్నది.

ఆ సూచనలు ఏప్రిల్ 18 వ తేదీ చర్చకు రాగలవని అధ్యక్షులు ప్రకటించిరి

## సంస్థానసైన్యాల భవిష్యత్తుపై ఢిల్లీలో చర్చలు

న్యూఢిల్లీ, ఏప్రియల్ 6: సంస్థానములలోని సైన్యములభవిష్యత్తును నిర్ణయించుటకుగాను నేడుదయం ఇక్కడ సంస్థానశాఖామంత్రిత్వ కార్యాలయములో రాజప్రముఖుల సమావేశమారంభమైనది. జయపూర్, నవనగర్, గ్వాలియర్, పాటియాలా, మహారాజులు రాజస్థాన్, సౌరాష్ట్ర, మధ్యభారత, తూర్పు పంజాబ్ సంస్థాన రాజప్రముఖులు సభలో పాల్గొనిరి. భారతప్రభుత్వం తరఫున వి. పి. మీనన్, యం. కె. వెల్లోడి, హెచ్. యం. పటేల్ (డిఫెన్సు కార్యదర్శి) మొదలగువారు పాల్గొనిరి.

నేడు సమావేశము రెండు పర్యాయములు జరిగి రేపటికి వాయిదావడినది

## కిన్నెరసానివద్ద బస్సు ప్రమాదం

భద్రాచలం, ఏప్రిల్ 4: కొత్తగూడెం బూర్గంపాడురోడ్డుమీద భద్రాచలం శ్రీరామనవమి ఉత్సవాలకు వస్తున్న యాత్రికులబస్సు ఒకటి మొన్న ప్రమాదవశాత్తు కిన్నెరసానివద్ద పడిపోయెను. దాదాపు 14 మందికి గాయములు తగిలినవి. వారు పాల్వంచ ఆస్పత్రిలో చేర్చబడిరి.

## అనాధ స్త్రీలకు ఆర్థిక సహాయం

హైదరాబాదు, ఏప్రిల్ 6: పోలీసు చర్యకు పూర్వముగాని, తరువాతగాని, కల్లోలములలో, భర్తలను కోల్పోయిన యువతులకు, సంరక్షకులను కోల్పోయిన బాలికలకు, ఆర్థిక సహాయ మిచ్చి ఆదుకొనుటకు హైదరాబాదు ప్రభుత్వం ఒక స్కీము తయారు చేసినది. ఈస్కీము ఉస్మానాబాద్, బీదర్, గుల్బర్గా, నల్గొండ, వరంగల్, నాందేడ్ జిల్లాలకు వర్తించును. సక్రమంగా దరఖాస్తుజరిపి, సహాయమునకు అర్హతగా నాయపడవలసినది. ఆజిల్లాల అధికారులకు ఉత్తర్వులు ఇవ్వబడినవి. ఉద్యోగుల వయసులైన పరుగువారిని కోల్పోయిన స్త్రీలకు ఆర్థిక సహాయంచేయుటకు ప్రభుత్వం ప్రతిపాదించిన స్కీములలో యిది మొదటిది

# రిశ్రమల అభివృద్ధి

# భుత్వ విధానాన్ని అమలు యడానికి విస్తృతాధికారాలు

## ద్ది కారక బిల్లును సెలెక్టు కమిటీకి వేదించడానికి పార్లమెంటు నిర్ణయం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: పాతిక రకముల పలను కంట్రోలుచేసి క్రమపద్ధతిలో బిల్లును సెలెక్టుకమిటీకి పంప పరి మంత్రి ప్రతిపాదింపగా, అధిసివేశ భ నేడు ఆమోదించెను. గత సంII ము నందు ప్రభుత్వము ప్రకటించిన మిక విధానమును అమలుజరుపు ఈ బిల్లు ఉద్దేశింపబడినది.

ద్రప్రభుత్వ పర్యవేక్షణయందుండే లందు కార్మిక సమస్యలను కేంద్ర మే పరిష్కరించుటకు గాను అం అనుకూలముగా పారిశ్రామిక లగా ప్రమును సవరించుటకూడ జరుగ పరిశ్రమల మంత్రి శ్యామ నముఖర్జీ తెలియజేసెను.

మికాభివృద్ధి ఒక పథకము ప్రకా డచుటకు ఈ బిల్లు అంకురార్పణ రత పారిశ్రామిక శాసన నిర్మాణ ఇదొక ప్రధాన ఘట్టమని ఆయన జేసెను. పరిశ్రమలమంత్రి ఉపన్య స ఇట్లు చెప్పెను. "దానిలో లోప వని చెప్పుటకు వీలులేదు. కూలం , అన్ని విషయములు చేర్చినగాని ర్మాణమునదిసంపూర్ణముకాదు. కంతటికి పథకము తయారుచేయు , వ్యవసాయము, విద్య, ఆరో మొదలైనవాటి నన్నిటినీ చేర్చి రెను. ప్రజల క్షేమాభివృద్ధికి మిచ్చే ప్రతిపాదనలను అమలు టకు పార్లమెంటు అంగీకా ంద వీలున్నది. ఒక నిర్ణీతపథక ము దేశాభివృద్ధిని తలపెట్టుట విషయముకాదు. నేను నేడు ప్రతి పచున్న బిల్లులో అసాధారణము ను. గత సంవత్సరము ప్రభుత్వము చిన పారిశ్రామిక విధానమును మోదించిరి. అపు డామోదింప ధానమును అమలుజరపుటకు కొన్ని యములను ప్రభుత్వము కోరుచున్నది. త్రమునకు సంబంధించిన కొన్ని లు క్రమపద్ధతిమీద అభివృద్ధి చెందు చుటే ఈ బిల్లు ఉద్దేశము. దేశ అవుసరములను దృష్టియందుంచు ఈ సందర్భమున పేర్కొనిన పరి జాబితా తయారు చేయబడినది.

పరిశ్రమలు పెంపొందటానికి, ప్రాథమిక పరిశ్రమలు అభివృద్ధి అవసరము. ఈ సందర్భములో శమును గమనించవలసి యున్నది. తాలో ఉన్న పరిశ్రమలన్నిటి మన ప్రభుత్వము తమ విధానమును పరచలేకపోయిన పక్షములో, కని మినహాయించుటకు ప్రభుత్వ అధికారమిచ్చుచూ బిల్లులో ఏర్పా డమైనది. అంతేకాక, గృహపరి , మత్స్యరక పరిశ్రమలను ఈ జాబి చేర్చలేదు. దేశమునకంతకూ పథ ర్పడినపుడు ఈపరిశ్రమలు ప్రాంతీ అభివృద్ధిచెందవలసి యుండును. శ్రమలు కొన్ని అవసరమైనా, లో వివిధ ప్రాంతములందు, చిన్న లు పెరుగుట అవసరమని ప్రభు ఇదివరలో పదేపదే చెప్పియున్నది.

బిల్లు ననుసరించి ప్రభుత్వమునకు వుచున్న అధికారముల విమర్శలు చాలా వచ్చినవి. ప్రభుత్వముల తోను, కార్మిక సులతో ముందుగా సంప్రతించుట . సంపూర్ణముగా ఏకాభిప్రాయము నవను ప్రధానమైన పరిశ్రమలను క్రమములో నడపుటకు శాసన ంతలేనను విషయమున మాత్రము భిప్రాయ మనునదిలేదు. సభ సెలెక్టు కమిటీయందు చేయబడిన లను ప్రభుత్వము జాగ్రత్తగ ఆలో ము. పరిశ్రమలు అభివృద్ధి చెందవలె షయమున అభిప్రాయ భేదమునది అయితే ప్రభుత్వము రోజు కు నాటి నిర్వహణలో జేసికొనవలెనంటే అనుకున్న రము అవి అభివృద్ధిచెందుటకు పుచేయుటయనునదే ప్రధానసమస్య. శ్రమల అభివృద్ధివిషయమున రాష్ట్ర ప్రభుత్వములపాత్ర ఏమిటనికూడ ఆలో లెను.

సంII ర ప్రకటనలో ప్రభుత్వము మలను నాలుగురకములుగా విభజించి ) ప్రభుత్వమే సొంతదారుగనుండి, ణకూడ తానే వహించగలదు. (2) ము ఇతరులు స్థాపించిన పరిశ్రమలు ఉన్నవి. ఒక నిర్ణీతకాలం వరకు ప్రభుత్వము వాటిని స్వాధీనం చేసికొనదు. తర్వాత వాటి అభివృద్ధి ప్రభుత్వ యాజమాన్యముక్రిందనే ఉండగలదు. ఈ విధమైనవి 18 రకముల పరిశ్రమలున్నవి. ఇలాంటివి ప్రస్తుతము వ్యక్తులు ఆరంభించి నవాటిని అవేవిధంగా ప్రభుత్వము ఉండనీయగలదు. కాని ఆ రకమునకు చెందిన క్రొత్తపరిశ్రమలను స్థాపించుట మాత్రము ప్రభుత్వమే చేయవచ్చును. ఆ రంగమంతయు కేంద్ర ప్రభుత్వ ఆధిపత్యము క్రిందనే యుండగలదు. ఈ తారతమ్యము లన్నిటినీ తెలియజేయు నిర్వచన బిల్లులో లేదు. ఎప్పుడవసరమనితోస్తే అపుడా పరిశ్రమను వశము చేసికొనుటకు, అవసరమైతే ఆ రకపు క్రొత్త పరిశ్రమను స్థాపించుటకు వీలుగా ఉండునట్లు బిల్లు తయారు చేయబడినది. అయినప్పటికీ కూడా ఒక క్రమపద్ధతి ననుసరించి, వ్యక్తులు కూడ పరిశ్రమలను స్థాపించవచ్చును. బిల్లును పురస్కరించుకొని ఇపుడు యితరులు ఆరంభించిన పరిశ్రమలను గురించిన సమాచారమంతను ఒక నిర్ణీత తేదీలోగా, ప్రభుత్వము తెలిసికొనగలదు. అందునగాను ప్రభుత్వము ఆ కంపెనీలను నమోదుచేయును. ఈ పద్ధతి, వ్యక్తులు, స్థాపించిన కంపెనీలకే గాక, ప్రభుత్వము స్థాపించినవాటికి కూడ వర్తించును. ఇక ముందు ఆరంభించ పోవువాటికి, ఒక లైసెన్సు పద్ధతిని అనుసరించుట జరుగును. రానున్న చట్టమునను సరించి ఏర్పడగల నిబంధనలను పురస్కరించుకొని, ఆ లైసెన్సు విధానము నిర్ణయింపబడును. ఆ నిబంధనలు, రాష్ట్ర ప్రభుత్వముల, పారిశ్రామికుల పార్లమెంటు సభ్యుల అభిప్రాయముల ననుసరించి తయారుచేయవలసి యుండును. ప్రస్తుతము బిల్లుననుసరించి నియమింపబడే సలహాసంఘము సూచనల ప్రకారము నిబంధనలు తయారుచేసి తరువాత పార్లమెంటు ఆమోదమునకు సమర్పించవలెనని ప్రభుత్వ ఉద్దేశము. అపుడు పార్లమెంటు తనకు తోచిన సవరణలుచేయ వీలవును. సలహాసంఘము ప్రభుత్వమునకు అతీతమైనదని అంగీకరించము. చట్టములోని నిబంధనలను అమలుజరపు బాధ్యతను ప్రభుత్వమే వహించగలదు. సలహాసంఘమును ప్రభుత్వము సంప్రతించగలదు. కాని వారి సలహాలను పూర్తిగా అంగీకరించగలరని హామీ ఇవ్వజాలము.

పరిశ్రమలు కనుక సక్రమముగా నిర్వహింపబడిన ప్రభుత్వము అనవసరముగా వాటిపై ప్రమేయము కలిగించుకొనునని అనుకొనవసరములేదు. కొన్ని పరిశ్రమల నిర్వహణను ప్రభుత్వము వశము చేసికొనగలదు. అన్న నిబంధనకరించి కొన్ని అపోహలున్నట్లున్నవి. అవాంతర పరిస్థితులందు అవసరమని తలచినపుడే ప్రభుత్వము అట్టివాని కుపక్రమించగలదు. సలహాసంఘమునుకూడ ముందుగా సంప్రతించగలము. చట్టనిబంధనలను సరిగా అమలు జరుపుటకు కంపెనీల ఉద్యోగులకు బాధ్యత చేయు విషయమునుకూడ జాగ్రత్తగ ఆలోచించితిమి. ఆ ఉద్యోగుల పేర్లను తెలియజేయవలసినదని ప్రభుత్వం పట్టుపట్టగలదు. కేంద్రమునకు అధికారములు ఎక్కువగా యున్నవని రాష్ట్రములు భయపడనవసరములేదు. అయితే ఈ విషయములో అంత్యనిర్ణయాధికారము కేంద్రప్రభుత్వముదే.

పంపకము ధరల కంట్రోలుగురించి ఈ బిల్లులో ఏమీ తెలియజేయలేదు. కేంద్ర ప్రభుత్వము ఏదైనా శాసనను చేసినతప్ప ఈ బాధ్యతే రాష్ట్రప్రభుత్వములది. కేంద్ర ప్రభుత్వమునకు సంబంధించిన పరిశ్రమలకు చేసినశాసనములు రాష్ట్రశాసనములను రద్దు చేయగలవు,

పారిశ్రామికులందు, కార్మికులందు అతివాదులు ఈ బిల్లును విమర్శించవచ్చును. ప్రభుత్వముమధ్యే మార్గమును అవలంబించినది. ప్రభుత్వసహాయములేకుండ పరిశ్రమలను ఏ పారిశ్రామికుడు ఆరంభించగలడు. దేశ ఆర్థిక అభివృద్ధికి ప్రభుత్వముచేయుచున్న ఈ ప్రయత్నమునందు కార్మికులు పారిశ్రామికులు ప్రభుత్వములో సహకారము చేయవలెను. ఈ విస్తమైన బిల్లును తీసికొనివచ్చుటలో ప్రభుత్వమువహించుచున్న భారము నొప్పదని నాకు తెలుసును. పారిశ్రామికులు, కార్మికులు ప్రవర్తించే పద్ధతినిబట్టే కొంతవరకు ప్రభుత్వము గూడ తమ బాధ్యతలను నిర్వహించి దానినిబట్టి పరిశ్రమాభివృద్ధి యుండగలదు. ఇతరులను విమర్శించి, అడ్డంకులను కలిగించుటకే కొంతమంది అందివతోనూ సంప్రతించి, మార్గమును సుకరము చేయుటే ప్రభుత్వవిధి. ప్రభుత్వము ఏది తలపెట్టినా, ఏదిచేసినా అనవసరజాప్యము, క్రొత్త సమస్యలు ఉత్పన్నమగునని సాధారణముగా విమర్శింపరాదు. వీటన్నిటినీ ఎదుర్కొని పరిష్కరించవలసియుండును. అన్ని విషయముల నూతన దృక్పథముతో సమస్యలను పరిశీలించవలసియుంటుంది. దేశ సంపదను, అన్ని విషయముల సాధ్యమైనంత శీఘ్రముగ అభివృద్ధిచేయవలెనని ప్రభుత్వము ప్రయత్నించుచున్నది. అందుకు అన్ని వర్గములు, సహకరించవలెనని ఆశించుచున్నాను." అని పరిశ్రమలమంత్రి ఉపన్యాసమును ముగించెను.

జాతీయ్రేడు యూనియన్ కాంగ్రెసు అగ్యక్షుడు హరిహరనాథశాస్త్రి బిల్లును హృదయపూర్వకముగా బలపరచిరి. అయితే కొన్ని లోపములున్నవనిరి. పంపకమునకే కాక, ఉత్పత్తికికూడ కంట్రోలు ఉండవలెననిరి. కొన్ని పెద్ద పరిశ్రమదారుల పైఖరివల్ల కార్మిక వర్గమునందు అసంతృప్తి విశేషముగనున్నదనిరి. "కొన్ని రాష్ట్రములందు కార్మిక శాసనములున్నవి. వాటిని పురస్కరించుకొని, కార్మిక శాసనములను తిరస్కరించిన పరిశ్రమలను వశము చేసికొన రాష్ట్ర ప్రభుత్వములకు అధికారమున్నది. ఈ బిల్లులో చేర్చబడిన పరిశ్రమల గురించి అలాంటి రాష్ట్రముల స్థితి ఏమిటి! మొదట రాష్ట్ర ప్రభుత్వములు చర్య తీసికొని తరువాత కేంద్ర ప్రభుత్వ అనుజ్ఞ పొందునట్లుగా చూడవలెను." అని ఆయన చెప్పెను.

పరంజిపాయి దేశముఖ్ గారు మాట్లాడుచు బిల్లు నిబంధనలు జాగ్రత్తగ అమలుపరచవలెననిరి. భారతదేశము పరిశ్రమలను పూర్తిగా జాతీయము చేయుటకు పరిపక్వము కాలేదనిరి.

పరిమితమైనప్పటికీకూడ ఈ బిల్లునందు అనేక విషయములు వదలి వేయబడినట్లు కె. టి. షా గారు విమర్శించిరి. సినిమా వంటి జాతీయ నిర్మాణపరిశ్రమ, గృహపరిశ్రమలు ఈబిల్లు పర్యవేక్షణలోనికిరాలేదని, కార్మిక వేతనములు, వారిస్థితి, ధరలకంట్రోలు ప్రసక్తికూడ వదలివేయబడినవనిరి. యజమానిత్వము, నిర్వహణతప్ప కార్మికులసంగతి, వినియోగదారులసంగతి అంతగ పట్టించుకొనలేదు. ప్రధాని నెహ్రూ విదేశీ పెట్టుబడులగురించి చేసిన ప్రకటనను వ్యాఖ్యానించుచూ వెల్లపెట్టుబడిదారులను, నల్లపెట్టుబడిదారులను తారతమ్యమునది లేదనిరి. విదేశీపెట్టుబడిదారులు పెద్ద ఎత్తు యంత్రములను తెచ్చెదరనుమాట నిజమేకాని, ఆ యంత్రముల కొరకు భారతదేశము ఎల్లకాలము వారిపైననే ఆధారపడి యుండవలసి వచ్చును. అంతేకాకుండ విదేశీపెట్టుబడులవల్ల రాజకీయ చిక్కులుకూడ రాగలవు. ఇతర దేశముల అనుభవము తెలియదుకాని, అతిగా విదేశీపెట్టుబడిని కోరకపోయినా మంచిదని షా గారనిరి.

పారిశ్రామికులు బిల్లు సూత్రమునకు సుముఖులగీ, దానిని ఆచరణ పెట్టుటందు ప్రభుత్వమునకు తోడ్పడుదురని సర్ హోమీ. పి. మోడీగారనిరి. ప్రభుత్వము అతిత్వరగా పురోగమించవలెనను చున్నది. కొంచెము తాపీగా వెళ్లవలెనని పారిశ్రామికు లంటున్నారు. ఇంతకుమించి ఇద్దరికి భేదము అనునదిలేదు. బిల్లు ప్రభుత్వమునకు ఇచ్చుచున్న అధికారములు అవసరమైన దానికన్న ఎక్కువగానున్నవి. పారిశ్రామిక పథక నిర్మాణములో ఇదే ప్రథమ మోతాదు అయిన అది చాలాఘట్టి మోతాదు అని చెప్పవలసియున్నది. అని మోడీ గారనిరి.

టి. టి. కృష్ణమాచారి: గట్టి మోతాదేకాని ప్రమాదకరమైనది కాదు కదా? (నవ్వు)

ప్రధాని విదేశీ పెట్టుబడిని గురించి చేసిన ప్రకటన అద్భుతముగ నున్నది. కాని ఈ బిల్లులో నిర్వచించిన విధానము, దానికి విరుద్ధముగ కాదా అని మోడీగారు ప్రశ్నించిరి. మనము పెట్టుబడిని ఆశించేది ఒక దేశమునుండి మాత్రమే. ఆ దేశము వ్యక్తి ప్రయత్నమునందు అభిమానము చూపుచున్నది. పరిశ్రమలను ప్రభుత్వ పికిలిలో పెట్టి బిగించుట వారికిష్టముండదు. కాబట్టి ఆ విషయమును ఆలోచించుట అవసరమని మోడీగారు హెచ్చరికచేసిరి. సెలెక్టుకమిటీ తగిన సవరణ చేయునని ఆశించిరి.

ఈ బిల్లు రాష్ట్రములకు ముందుకు నడవకుండా అరికట్టుచున్నదనియూ, 25 రకముల పరిశ్రమలనుకాక ఏదు ఎనిమిదింటిమైన మాత్రమే కేంద్రప్రభుత్వము అధికారము కలిగియున్నదని బొంబాయి శ్రీ కృష్ణమాచారిగారనిరి. అన్నిటినీ, కేంద్రం నిర్వహించేస్థితిలో లేదనికూడ తెలిపిరి. ఇంగ్లండు ప్రభుత్వము అక్కడి పారిశ్రామికులకు చూపుచున్న దాక్షిణ్యము కన్న, భారతప్రభుత్వము భారత పారిశ్రామికులపై చూపుచున్నది ఎక్కువ ఉదారముగ నున్నదనియు, భారత పారిశ్రామికులు సహాయపడనప్పుడు విదేశీపెట్టుబడిని ప్రభుత్వము ఆశించుటలో తప్పలేదనియు శ్రీ కృష్ణమాచారిగారు, మోడీగారి విమర్శకు సమాధానముగ చెప్పిరి.

## ఆంధ్రవిశ్వవిద్యాలయం వైద్య పరీక్షలు

వాల్తేరు, ఏప్రిల్ 5: 1949 మార్చిలో జరిగిన వైద్యపరీక్షలలో యీ దిగువ నంబర్లవారు ఉత్తీర్ణులైరి.

ప్రీ రెజిస్ట్రేషన్

రెండవ తరగతి: 1 2 3 4 5 6 7 10 11 12 13 14 15 16 17 18 19.

కెమిస్ట్రీ

8 9.

బయాలజీ

9 మాత్రమే,

మొదటి ఎం. బి. బి. ఎస్.

రెండవ తరగతి: 20 21 24 25 27 29 30 31 32 33 34 35 36 37 38 40 42 44 46 48 50 51 52 56 59 61 62 63 65 66 67.

అనాటమీ

23 39 41 47 58 64.

రెండవ ఎం. బి. బి. ఎస్.

I వ భాగం, ఫార్మకోలజీ

69 70 73 74 77 78 79 80 81 82 83 84 85 86 88 89 90 92 93 94.

రెండవ భాగం

రెండవ తరగతి: 94 96 97 98 99 101 103 105 106 107 108 109 110 111 112 113 115 116 121 122 124 125 126 127 128 130 131 132.

హైజీన్

114 129 133.

పాథాలజీ, బాక్టీరియాలజీ

95 102 104.

## అమెరికాకు రాల్ఫ్ బంచ్ తిరుగు ప్రయాణం

### ఏ పరిస్థితుల్లోనూ పాలస్తీనా తిరిగి రానని ప్రకటన

రోడ్స్, ఏప్రిల్ 7: రోడ్స్ దీవిలోని తన శాంతి కార్యాలయాన్ని ఎత్తివేయడానికి పాలస్తీనా తాత్కాలిక మధ్యవర్తి డాక్టర్ రాల్ఫ్ బంచ్ నేడు అక్కడికి బయల్దేరుతున్నాడు. డాక్టర్ బంచ్ దాదాపు రెండు సంవత్సరాలుగా ఈ పాలస్తీనా సమస్యాపరిష్కారంలోని మగ్నమై ఉండెను. రోడ్స్ దీవిలోని కార్యాలయాన్ని ఎత్తివేసే పని పూర్తి కాగానే ఆయన అమెరికా వెళ్ళిపోతాడు ఏ పరిస్థితులలోనూ తాను పాలస్తీనా తిరిగిరానని ఇవాళ రాయిటర్ విలేఖరికి స్పష్టంగా చెప్పాడు "నేను చాలా అలసిపోయాను. ఎప్పుడెప్పుడు వీటన్నిటినుంచీ తెంచుకుపోదామా అని చూస్తున్నాను" అని కూడా ఆయన అన్నాడు. మిగతా ఉన్న పనిని ఆయన సహితీ మధ్యవర్తి సంఘానికి వప్పచెప్పి వెళ్ళిపోతారు. అయినా రేపు ఇక్కడ ప్రారంభం కానున్న ఇజ్రాయల్-సిరియా సంప్రతింపులకు సంబంధించిన వివరాలను ఎప్పటికప్పుడు తెలుసుకుంటూనే ఉంటారు.

## విషవాయువు పీల్చుటచే తక్షణ మరణం

ఖమ్మంమెట్టు, ఏప్రిల్ 6: నిన్న నిక్కడ నున్నపుట్టు పట్టుచుండగా వచ్చిన కార్బన్ మొనాక్సైడ్ అనే విషవాయువును పీల్చుటచే అచ్చట పని చేసే 4 గురు తక్షణమే మరణించిరి. 4 శవములు పోస్టు మార్టమ్కై పంపబడెను.

ప్రభుత్వ ఋణపత్రములు, సక్రమముగ అమ్ముడవుటకట్లు, ప్రభుత్వ ఋణములు పూర్తి అవునట్లు మోడీగారు బొంబాయి వెళ్ళి ప్రయత్నించవలెననిరి.

వచ్చే 5 సంII ములందు పరిశ్రమ అభివృద్ధికి ప్రభుత్వ కార్యక్రమమేమో చెప్పవలెనని, ఉత్పత్తిని అధికము చేయుటకు ఏను చేయదలచిరో చెప్పవలెనని పండిత కుంజ్రూ గారనిరి. ఏ పరిశ్రమలందు విదేశీ పెట్టుబడులను కోరెదరో, ప్రభుత్వము దేని యందు పాల్గొనునో కూడ చెప్పవలెననిరి.

చర్చలకు సమాధానమిచ్చుచూ, పారిశ్రామికులగాయిచూ లవల్ల పరిశ్రమలను కేంద్ర ప్రభుత్వము వశపరచుకొనునా అన్న విషయము బిల్లులో నున్నదని పరిశ్రమలమంత్రి చెప్పెను. కేంద్రప్రభుత్వ అంగీకారము పొందిన రాష్ట్రములుకూడ కేంద్రమునకు సంబంధించినవన్న పరిశ్రమలను స్థాపించవచ్చుననిరి. విదేశీపెట్టుబడులకు ప్రత్యేక హక్కులుండవు. ప్రత్యేకఇబ్బందులుండవు. ఈ ప్రభుత్వపరిశ్రమ విధానమునకులోబడే విదేశీపెట్టుబడిదారులు వ్యవహరించవలసి యుండును. అని పరిశ్రమలమంత్రి స్పష్టీకరించిన తరువాత బిల్లును సెలెక్టుకమిటీకి పంప సభవారు ఆమోదించిరి.

## అఫ్ఘాన్ సమీక్ష

(1-వ పేజి తరువాయి)

ఆసియా పునరుద్ధరణకు రష్యా సూచిస్తున్న విధానానికీ, పశ్చిమ రాజ్యాలు సూచిస్తున్న విధానానికీ ఇది మధ్యేమార్గంగా వుంటుంది.

"ఆసియా పునరుద్ధరణకుగాను ఆర్థిక సభవారి ప్రణాళికలను పరిశీలించి తగిన సలహాలిచ్చి సంస్కరించుతూ ముందుకు తీసుకుపోవటానికిగాను, వివిధ దేశాలకూ ప్రాతినిధ్యముండేలాగు ఒక పరిశీలనా సంఘాన్ని నెలకొల్పాలని కూడా ఆ తీర్మానంలో ప్రతిపాదించాం.

పారిశ్రామిక వాణిజ్యపరిస్థితులను చక్కదిద్దటానికి ఆసియా ప్రాంతానికి ప్రత్యేక సంఘం యేర్పాటు కావాలని ఆర్థిక మహాసభ నిర్ణయించటంతో, ఆ సంస్థ, ఆసియా ఆర్థిక సమస్యలన్నిటినీ ముఖాముఖి యెదుర్కొనవలసిన అవసరం యేర్పడుతున్నది. ఈ కొత్త ఉపసంఘం ఆశ్లో నాటికి నిర్మాణం చేయబడుతుంది. ఆ సంఘం యేటేటా రెండేసి దఫాలు సమావేశమౌతూ, ప్రతివానికి మహాసభ సలహా సంప్రదింపులకు పోకుండా, ఉపసంఘాలద్వారానూ, ఇతర ఉపశాఖలద్వారానూ కార్యక్రమాన్నంతా స్వయంగా నిర్వహించుతుంది. లోగడ ఉదకమండలం, లాప్టనులలో జరిగిన సమావేశాల ఫలితంగా యీడీ ప్రత్యేకసంస్థ యేర్పడటానికి అవకాశం కల్గింది. దీని ఫలితంగా, ఆర్థిక సమావేశానికి, ఆయా దేశాల అంతరంగిక విషయాల్లో జోక్యం కల్గించుకునే అవకాశం తగ్గిపోతుంది. రాజకీయ రంగానికీ ఆర్థిక రంగానికీ వున్న పీటముడి విడిపోతుంది.

"భారతదేశం ప్రతిపాదించిన ఈ తీర్మానానికి ఆయా దేశాలవారు కలుగచేసిన సహకారానికి కృతజ్ఞత తెలుపుతున్నాం. నిర్ణీతమైన ఆర్థిక విధానంతో భారతదేశం ఈ సమావేశానికి హాజరైన కారణంగా, కొంత మేలు జరిగింది.

"పాశ్చాత్య రాజ్యాల సంయోగానికి భారత ప్రతిపాదనలు దారితీయగల అవకాశంవుంది" అన్నారు.

## పారిశ్రామిక వాణిజ్యసంఘ స్థాపన

బాంకాక్, ఏప్రిల్ 6: ఆసియా దూర ప్రాచ్య ఆర్థికసంఘం నేటి సమావేశంలో రష్యా ప్రతిఘటనను నిర్లక్ష్యముచేసి వాణిజ్యము, పరిశ్రమల నిమిత్తమొక సంఘమును స్థాపించినది.

ఈ సంఘము అసలు సంఘమును నిర్జీవమొనర్చుచున్నదని రష్యన్ ప్రతినిధి విమర్శించెను. ఇప్పుడున్నన్ని అధికారములు కాక తక్కువ అధికారము లిచ్చుచూ ఒక కమిటీని నియమించవలెనని సూచించుచూ రష్యన్ ప్రతినిధి ప్రతిపాదించిన తీర్మానము నిరాకరించబడినది.

రష్యా తీర్మానము ఆసియా రాజ్యములలో రాజకీయోద్యమములకు ప్రతిబంధకమగును. దూరప్రాచ్య ఆర్థిక సంఘ కార్యాలయములో అదనముగా నలుగురు ఇంజనీర్లను చేర్చవలెనని భారత ప్రతినిధి సూచించెను.

ఆసియా ఆర్థికాభివృద్ధిని గురించి డా॥ లోకనాథన్ గారు తయారు చేసిన నివేదిక బుట్టదాఖలైనందుకు విచారించుచూ, అమూల్యమైన ఈ నివేదికను సంఘము చర్చించకుండుట సిగ్గుచేటని రష్యన్ ప్రతినిధి చెప్పెను. తమ నివేదికను చర్చించవలెనని ఒత్తిడిచేయుటకు లోకనాథన్ గారికే తగ ధైర్యము లేకపోయినదని రష్యన్ ప్రతినిధి అధిక్షేపించెను. ఆసియా, దూరప్రాచ్య దేశముల హితము కొరకైననూ తమ నివేదికను డా॥ లోకనాథన్ గారు చర్చకు పెట్టవలెనెను. డా॥ లోకనాథన్ గారు ఈ అధిక్షేపణములను లక్ష్యము చేయలేదు

## గ్రీసులోకి అల్బేనియా గెరిల్లా దళాల ప్రవేశం

ఏథెన్సు, ఏప్రిల్ 6: వాయవ్య గ్రీసులోని, పశ్చిమ గ్రామాస్ ప్రాంతాన్ని, క్రిందటి సంవత్సరం, 30,000 వేల సైన్యాన్ని బలిపెట్టి గెరిల్లాల చేతుల్లో నుంచి స్వాధీనం చేసుకుంది. ఈ ప్రాంతం తమ వశమై పోయినట్టుగా, గెరిల్లాలు ఈ రోజు ప్రకటిస్తున్నారు.

ప్రభుత్వ ప్రకటన ఇలా తెల్పుతోంది:

"అల్బేనియా నించి, గెరిల్లా దళాలు, ఎడతెరిపి లేకుండా వచ్చిపడి విప్లవకారులకు సాయపడి ప్రభుత్వ స్థావరాల మీద పెద్దపెట్టున దెబ్బ తీయటానికి ప్రయత్నించినై, కాని వాటి నన్నిటినీ తిప్పికొట్టాం. శత్రువులకు చేజిక్కిన భూభాగాన్నంతా తిరిగి లాక్కున్నాం.

"గ్రామాస్ ప్రాంతంలో అల్బేనియన్లు జోక్యం కల్గించుకోటంతో, ప్రభుత్వ సైన్యాలకు చాలా కోపంగా వుంది. సరిహద్దు సంఘర్షణలు జరగకుండా కాపాడటం చాలా కష్టసాధ్యంగా వుంది" అని ప్రభుత్వం ప్రకటించింది.

## పోలండులో రష్యన్ సైన్యాల సమీకరణ

వాషింగ్టన్, ఏప్రిల్ 6: "ఈ సంవత్సరంలో పశ్చిమదేశాలపై జరుగబోయే దండయాత్రకై" రష్యా నూతన లక్షలమంది సైనికులనుపైగా పోలండులో సమీకరణ చేసినదని సంయుక్తరాష్ట్రాలకు చేరుకున్న ఇద్దరు పోలీసు కాందిశీకులవల్ల తెలుస్తున్నది.

వీరు పోలీసు సైనికుప్రభుత్వశాఖ, స్టానిస్లావ్ బాంజెక్, కార్యదర్శి, స్టానిస్లావ్ [illegible] గారలు. సోవియట్ సైన్యాల సమీకరణ ఎక్కువగా పశ్చిమపోలండులోనూ, జర్మన్ సరిహద్దునంబడిని జరిగినదని వీరు చెబుతున్నారు.

బాల్టిక్ సముద్రతీరంపై టాంకులు, విమానాలు విన్యాసాలను జరపటం తాను చూచానని బాంజెక్ గారన్నారు. రహదారులన్నీ విశాలం చేయబడుతున్నాయట. వంతెనలుకూడా బలపరచబడుతున్నాయి.

పోలీసు, విమానసైన్యాలలోని ప్రతిరేకాధిపతులు కలిగినవారం దరూ సోవియట్ రాజకీయాధికారులచే తొలగించబడుతున్నారు. గ్లోబ్.

## రాష్ట్రమంత్రుల అభిప్రాయాలు

1 వ పేజి తరువాయి

యం చెయ్యటానికి పూర్వము చెన్నపట్నం ఆంధ్రుల అభిప్రాయాలను గ్రహించవలెను. తమిళుల జీవితము, అభ్యుదయము, సంస్కృతులతో చెన్నపట్నం ఎట్లు పెనవేసుకున్నదో ఆంధ్రుల జీవితం, సంస్కృతి, సంపదలు గూడా ఈ మహానగర పుట్టు పెంపులతో లీనమై ఉన్నవి.

రాయలసీమలో ఏ ప్రజాసంస్థగాని ఆంధ్రరాష్ట్రము వద్దని ఎన్నడూ కోరలేదు. ఆంధ్రదేశములో రాయలసీమ అవశ్యమూ అంతర్భాగమే. ఆంధ్రులతో కలసి ఉండుటకు వారెన్నడూ అభ్యంతరము తెలపలేదు: కాని రాయలసీమ ఇతర ప్రాంతముతో సమానముగుటకు ఆర్థికాభివృద్ధికి కొన్ని రక్షణలు కావలెననియే ఇంత కాలముకోరుచున్నారు.

ప్రస్తుత మంత్రివర్గములో సమప్రాతినిధ్యము వచ్చినదిగదా అని ఆంధ్రపత్రిక ప్రతినిధి అడుగగా 'అవును' అని మంత్రిగారు ఒప్పుకొనిరి.

### రాష్ట్రమూ, పట్నమూ రెండూ ఎల్లా వస్తాయి?

మద్రాసు ప్రభుత్వ ఆర్థికమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు ఇటుల చెప్పిరి:- చెన్నపట్నం తమిళరాష్ట్ర అంతర్భాగము గావలెననిగాని, చెన్నపట్నంపై తెలుగులు హక్కు వదులుకోవాలనిగాని మన వర్కింగు కమిటీలోని నాయకులు తీర్మానించినారంటే మన మా తీర్పును శిరసావహించవలసినదే. అందులో భాషారాష్ట్రనిర్మాణ ద్రష్ట డాక్టరు పట్టాభిగారు ఆసంఘములో ఉన్నారు. యన చెన్నపట్నం పుట్టుక, పెంపు చరిత్ర, జనాభా, లెఖ్ఖలూ కరతలామలకం. అవన్నీ గ్రహించే ఆయన ఏకగ్రీవమైన ఆనివేదికపై సంతకం పెట్టినారంటే ఇంక మనకు శంక అవసరం లేదు. శీఘ్రంగా ఆంధ్రరాష్ట్రము వచ్చుటకు ఆంధ్రేతరులైన మిత్రుల సహకారము వరించుటకు అంతకన్న గత్యంతరము లేకపోయి ఉండవచ్చును. రాయలసీమ నెల్లూరుజిల్లాలవారికి చెన్నపట్నం పోవటం పెద్దదెబ్బ. అయితే ఆంధ్రరాష్ట్రం రావాలి, చెన్నపట్నం కావాలి అంటే సంభవంకాదు. చెన్నపట్నం తమిళులది తమిళులు కోరిన దానికి కాంగ్రెసు అధిష్టానవర్గంవారి అధికార ముద్రపడినపుడు అది అసంభవం గాదా?

ఇక ఆంధ్రరాష్ట్రం వచ్చుటకు, అందుకుతగిన జమాలెఖ్ఖలూ తేల్చుకొనుటకు కనీసం 12 మాసములైనా అవసరం.

### ఆంధ్రరాష్ట్రానికై చెన్నపట్నం వదలుకోము

చెన్నపట్నం, ఎం. ఎల్. ఎ. సంటూరు నరసింహారావుగారు ఇట్లు తెలిపిరి:

ఆంధ్రరాష్ట్రమునకై చెన్నపట్నముపై హక్కును మేము వదులుకోము. చెన్నపట్నాన్ని ఇంకొకరికి దత్తంచేసే ముందు నాయకులు ఆంధ్ర ప్రజాభిప్రాయాన్ని గ్రహించి, లక్ష్యంచెయ్యవలసిఉండును.

### రాయలసీమ, సర్కారులూ ఒక్కటే

మద్రాసుప్రభుత్వ మద్యనిషేధమంత్రి నీలం సంజీవరెడ్డిగారు ఇటుల చెప్పిరి: రాయలసీమ ఆంధ్రదేశమూ ఒక్కటే, సర్కారుజిల్లావారికి ఆంధ్రరాష్ట్రము ఎంత అవసరమో, రాయలసీమవారికీ అంతగానే కావలెను. శ్రీ బాగ్ ఒడంబడిక అమలుగావలెను. అంతే రాయలసీమవారు కోరుచున్నారు. దానిని అమలుచేసెదమని నాయకులు ప్రమాణమిచ్చి ఉన్నారు. అయితే కోస్తా నాయకులవలె తక్షణమే రాష్ట్రము కావలెనని అంత ఆత్రముగా రాయలసీమవారు కోరుచుండకపోవచ్చు. ఆంధ్రరాష్ట్రము వచ్చినప్పుడు ఈ ఈ రక్షణలు కావలెనని మాత్రము రాయలసీమవారు కోరుచున్నారు. అంతే. రాయలసీమ ఆర్థికముగ ఎంతో దౌర్భాగ్యస్థితియందున్న సంగతి జగద్విదితము. మమ్ము కొక కంట పెట్టవలెననియే మేము కోరుచున్నాము.

రాయలసీమ ప్రజలూ, సర్కార్ల ప్రజలూ ఏకోదరులే. సుఖదుఃఖాలలో, సంపత్సౌభాగ్యాలలో, మంచిచెడ్డలలో, వారు భాగస్వాములు. ఉభయులకు, అవినాభావమూ, అనిర్వచనీయమైన సంబంధము ఉన్నది.

చెన్నపట్నాన్ని తెలుగువారు వదలుకోవాలనటం కన్న అది సముష్టి రాజధానీ నగరము చేసినచో చక్కని పరిష్కారము. దానిని ఆంధ్రరాష్ట్రమునుంచి వేరుచేయువారు రాయలసీమ ప్రాంతములవారి ఇక్కట్టులను దృష్టినం దుంచుకొనవలెను.

### మనందరిదీ ఒకటే రక్తం

జి. వెంకటరెడ్డి ఎం. ఎల్. సి. గారు ఇటుల తెలుపుచున్నారు: చెన్నపట్నంలో నివాసులైనవారికి నాయకత్రయ నిర్ణయం పిడుగుపాటువలె వచ్చినది. రాష్ట్ర నిర్మాణమునకు పూర్వము స్థానికుల అభిప్రాయాలను గ్రహించుట ఎంతో అవసరము. వారి సాధకబాధకాలను గుర్తించవలెను.

రాయలసీమ, సర్కారు ఆంధ్రాలదీ మనఅందరిదీ ఒకటే రక్తం దేశంఒక్కటే. రాయలసీమ వెనకపడిఉన్నది కావున కొన్ని రక్షణలుమాత్రమే అవసరమనుచున్నాము. రాయలసీమను ఉద్ధరించు భారము సోదరులైన సర్కారు ఆంధ్రుల పైననే ఉన్నది."

### 'తమిళులకు అసంతృప్తికరము'

పబ్లిక్ వర్క్సుమంత్రి భక్తవత్సలంగారిట్లు చెప్పిరి: ఈ పరిష్కారము సర్వజనరంజకము కాజాలదు. మనము కోరునదంతయు మనకెన్నడునూరాదు. మొత్తంపై ఆంధ్రరాష్ట్రం ఒక్క ఏడాదిలో నిర్మాణమగుట సాధ్యము. కమిటీవారి సిఫార్సు సాధారణముగా ఆంధ్రుల ఈప్సితము నీడేర్చగలదు. అదేవిధముగా తమిళ, కేరళ, కర్నాటక ప్రాంతీయుల మనోరథముల కూడా మన్నించి, తీర్పక పోవుట అసంతృప్తికరముగా ఉన్నది. కాని వారు చెప్పినంతవరకు బాగానేచెప్పినారు. భాషారాష్ట్ర నిర్మాణము ప్రస్తుతకాలమున జరుగుటలో అవాంతరములన్ని ఉన్నవని గుర్తించిన నాయకులు, అట్టి కష్టములు ఉన్ననూ ఆంధ్రరాష్ట్రము ప్రథమమున ఇచ్చుట వారి చిరాభిలాషను నెరవేర్చుట బాగున్నది."

## గోధుమల దిగుమతికి ఒప్పందము

న్యూఢిల్లీ, ఏప్రిల్ 7: నాలుగు ఏండ్లపాటు గోధుమలను దిగుమతులను చేసికొను టకు ఒప్పందము జరగినదని ఆహారమంత్రి ఒక ప్రశ్నకు సమాధానముగా పార్లమెంటులో నేడు తెలిపెను. మార్కెటు ధర మనుకు 1 కి రు 5-7-0 కు తగ్గినపుడే 1952 సంII ఆగస్టు తరువాత 10 లక్షల టన్నులను కొనవలసి యుండును. అలా కొన్నవి నిలువ చేసికొనుటకు ఉపయోగింపబడును. 1951 సంII ము తరువాత ఆహార ధాన్యము దిగుమతి చేసికొనటము అంటూ ఉండదని ప్రధాని చెప్పిన తరువాతనే గదా ఈ ఒప్పందము చేసికున్నదని ప్రశ్నింపగా అవునని ఆహారమంత్రి సమాధానమిచ్చెను. పెద్ద అవాంతరమొచ్చిన తప్ప దిగుమతులుండవలెను.

## ఇన్‌సేన్ బర్మాప్రభుత్వ స్వాధీనం

రంగూన్, ఏప్రియల్ 7: ఇన్‌సేన్ పట్నం ఈ 9 నాలాలనుంచీ కేరన్ విప్లవకారుల చేతుల్లో వుంది. నిన్నటిదినం ఈ పట్నాన్ని బర్మాప్రభుత్వానికి వప్పగింత చేయటానికి నిన్నటిదినం అంగీకరించారు. ఈ వేళ లాంఛనప్రాయంగా వప్పగింత జరుగుతున్నది.

## అన్నమాచారి ఉత్సవం ముగింపు సభ

### ప్రయాగ నరసింహశాస్త్రిగారి కచేరి, సన్మానము

తిరుపతి, ఏప్రిల్ 5: శ్రీ అన్నమాచారి జయంతి ఉత్సవం నిన్న సాయంకాలం శ్రీ ప్రయాగ నరసింహశాస్త్రిగారి జానపదగీతాల పాటకచేరీ అనంతరం, కొల్లూరి వీరభద్రశాస్త్రి, తాళ్ళపాక శేషాచారి సూర్యనారాయణగార్లు మరి కొందరు స్థానిక ప్రముఖుల ఉపన్యాసాలు జరిగిన పిమ్మట అన్నమాచార్యులు, తిరువెంగడాచార్యుల విగ్రహములు ఊరేగింపుతో ప్రాచ్యవిద్యాకేంద్ర భవనమునకు గొంపోవుటలో సభముగిసెను. నిన్నటి సభకు సుమారు ఆరేడువేల మంది వచ్చిరి. శ్రీ ఘంటశాల మార్కండాచారిగారు, ప్రయాగ శాస్త్రిగారికిబంగారు పతకము శ్రీ వెంకటేశ్వరుని విగ్రహం చెక్కినది బహూకరించిరి. శాస్త్రిగారు తోలిరోజున చెప్పిన వెంకటేశ్వరర మాహాత్మ్యం విని మెచ్చుకొని యీ పతకం వారిచ్చినట్లు ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించిరి. ప్రయాగశాస్త్రిగారికి అన్నమాచారిగ్రంథమును ప్రభాకరశాస్త్రిగారు బహూకరించిరి.

నిన్న సభలో ముందుగ బంకుపల్లి లక్ష్మణశాస్త్రిగారు కొంతసేపు పాడిరి. తిరిగి చిన్నకర్ణము ప్రారంభమయేసరికి జనులు పోతూఉండగ, ప్రయాగ నరసింహశాస్త్రిగారు జానపదగీతాల సమ్మోహనాస్త్రంవేసి కూర్చుండబెట్టిరి.

"అన్నమాచారిపాటలలో పామరులకు సుసాధ్యమగువానిని గ్రామఫోనురికార్డులు తీయించి ప్రచారంచేయించినచో ప్రజలలో బాగుగ నల్లుకోగలవు. అన్నమాచారి మా తిరుపతివాడు అని సగర్వంగా మీరంతా పాడనేర్చి ఆనందించాలి. అరవలు త్యాగరాయకృతుల మాధుర్యాన్ని కాపాడి త్యాగరాయుడు మనవాడు అని చెప్పుకొని గర్వించుటకు వీలుగా చేసినారు. అట్లే అన్నమాచార్యుల కీర్తనలను మనమంతా సాధనం చేసి ప్రచారంలోకి తేవాలి. వాటిలో జానపదులకు అర్థమయ్యేవి సామాన్యవరుసలలో ఎన్నో వున్నాయి" అని చెప్పి ప్ర. న. శాస్త్రిగారు కొన్ని పాటలు ఎంచి కడు శ్రావ్యముగ పాడి, వాటికి సరిపోలు హిందీ వరుసలను గూడ పాడి సామ్యములు చూపిరి. "గొబ్బిళ్ళో, గొబ్బిళ్ళో" అను పాట, చిలకపదాలు, అవధారాల ప్రయోజనాలు తెలుపునవి, శ్రమ మరచిపోయేటందుకు దంపుళ్ళపాటలు, లాలిపాట, లంబాడీవాళ్ళ, బాయబాసు పాట మున్నగునవి పాడిరి. వీరి పాటల నానందించు శ్రోతలు తరువాత, ఉపన్యాసకుల నెవ్వరిని విననొల్లక లేచిపోతూవుండగ, ప్రయాగ శాస్త్రిగారు మరికొన్ని పాటలు పాడి వారిని నిలిపియుంచి, సభ ముగిసేవరకుండు లాగున చేసిరి.

శ్రీ కొల్లూరి వీరభద్రశాస్త్రిగారు, "ప్రయాగవారు కల్పించిన ద్వారం" ద్వారా తామీ సభకు వచ్చు కొంప వీలయినందుకు సంతసం తెల్పుచు, యీ ఉత్సవం దేశంలో నూతన వికాసం యిచ్చిందనియు, వచ్చే సంవత్సరానికి తాను కూడ అన్నమాచారి కీర్తనలు పాడనేర్చి వస్తాననియు చెప్పిరి.

తాళ్ళపాకం శేషాచారిగారు, తాళ్ళపాక సూర్యనారాయణగార్లు, అన్నమాచారి సంతతివారు, తమ కుటుంబం తరఫున ఉత్సవ మొనరించిన పెద్దలందరికి కృతజ్ఞత తెలిపిరి. కీర్తనలు వ్యాప్తిచేసే స్కీము దేవస్థానంవారు త్వరలో ప్రకటించగలరని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తెలియచ్చిరి. "శ్రీ వెంకటేశ్వరస్వామి అంతర్యామిగా వుండి యీ ఉత్సవాలు జరిపించేడు గాని తన ప్రమేయ మేమిలేదనియు ఉల్పక శక్తి రానికి నేను అంగుష్టమాత్రుడను. తిరుపతి ఆంధ్రదేశంలో చేర్పించాలనే ఉద్దేశంలో గాని, ఇలాంటివి కల్పించి తను ఉద్యోగం పాడిగిపడుకోవాలని తలపెట్టిన ఉత్సవాలుగా వివి. సత్యంగా భగవంతుని సంచరహించగ జాలిస్తే అన్నీ జయించగలము. భగవానుని ఆపద్రక్షకతనుపయోగించుకొని ఆస్తికతను సంపాదించ గల్గుటకు యట్టి కార్యాలు తోడ్పడును. భగవంతుని దీక్షతో గల్పిన భవరోగాలన్ని పోవును. ఈ ఉత్సవం జయప్రదంగా జరుగుటకు దేవస్థానంలో వారు వివరనేల బంట్రోతులు మొదలు కొంత కమిషనరువరకు ఒళ్లుదాచుకోక పనిచేసిరనియు చెప్పిరి.

ఆయూచిరులు నాగమణ్ణాశాస్త్రిగారు (హిందీ కోర్టు) తెలుగు సాహిత్యంలో జానపదసాహిత్యం కృష్ణశాస్త్రి సాహిత్యం లేవన్న కొంకొన్ని అన్నమాచార్యుల కీర్తనసాహిత్యం తీర్చిందనిరి.

తిమ్మశాస్త్రి పండితులకు సువర్ణ సాచార్యులుగాను, తాళ్లపాకం తొలి పాకంకునదసమనియు, దానితో సీలయగానములు కూడ కదిరినట్లే నినియు, భిలభాచారి అనగ భాగం రాగ తాళం కుదరిన కళలను ఆచార్యపనియు చెప్పిరి.

## కమ్యూనిస్టు ఖైదీ శ్రీమన్నారాయణ పరారీ

### కారు, డ్రైవరు పోలీసుల స్వాధీనం

ఏలూరు, ఏప్రిల్ 6: విజయవాడ క్రాసేమ్స్ హోటలు సమీపంలో జరిగిన హత్యకేసులో ముద్దాయిగా గత నెల 2-న కృష్ణాజిల్లా జడ్జీచే ఉరిశిక్ష విధించబడి, రాజమండ్రి కొనిపోబడు చుండగా పోలీసు కాపలానుండి తప్పించుకొని పారిపోయిన వి. శ్రీమన్నారాయణ లేది లిర్లు పోలీసులు ఏలూరునుండి ప్రయాణం చేసిన కారూ దాని డ్రైవరు పట్టుబడిరి. డ్రైవరు నిర్బంధంలో నుంచబడెను. జైలునుంటి కాపలానుండి ఈ పారిపోయిన వ్యక్తిగాను తమని పారిపోయిన యిద్దరు రిజర్వు కానిస్టేబులు భీముడోలు పోలీసు స్టేషను కు వెళ్ళి స్వాధీనమైరి. తప్పించుకొని పారిపోవుటకు ముందు శ్రీమన్నారాయణ, అతని అనుచరులు, పోలీసుల ముఖాలమీద మిరపకాయల కారం కొట్టినారనీ, వారినుండి కొంత మందుగుండు సామానుకూడ స్వాధీనం చేసుకొన్నారనీ తెలియుచున్నది. శ్రీమన్నారాయణ సోదరుడు బ్రహ్మానందాన్ని కూడా పోలీసులు నిర్బంధంలో నుంచిరి. శ్రీమన్నారాయణ పారిపోవుటలో యితనుకూడా సహాయపడినాడని ఆరోపించబడుచున్నది.

అన్నమయ బ్రహ్మ మన్నట్లు అన్నమాచారి ఉత్సవాలను జయప్రదంగా జరుపుటకు స్వాములు, శాస్త్రులు శర్మలు పలువురు యిచట కూడిరనియు, కమిషనరు డైరక్టరు ప్రెసిడెంటు వ్యాదంవారి పేర్లన్నింట స్వామి శబ్దం కలపనియు, తామర పువ్వును సూర్యుడు వికసింపజేసినట్లే యీ సాహిత్య పరిమళమును ప్రభాకరశాస్త్రిగారు వికసింపజేసిరనియు చెప్పిరి. తానం అనంతంగాగున్న అనంతకృష్ణశర్మగారు, వీరత్వం కురిపించే వీరభద్రశాస్త్రిగారు అంతా యిందు పాల్గొన్నారనిరి. శ్రీ కోతా కశేడ సుబ్రహ్మణ్య కవి, గాజులపల్లి హనుమచ్ఛాస్త్రి, ఎం. ఎం. వెంకటాచారిగార్లుకూడ ప్రసంగించిరి.

ప్రాచ్యకళా పరిశోధనాలయం డైరెక్టరయిన పరవస్తు రామానుజస్వామిగారు, బయటప్రాంతాలనుండి వచ్చి ఉత్సవానికి తోడ్పడిన కళారాధకులందరికీ, దేవస్థానం ఉద్యోగులు చురుకుగా పనులన్నీ చేయించినందుకు అందరికి అభినందనములు తెలిపిరి. ప్రయాగశాస్త్రిగారు అప్పగింతల పాటపాడినాక, అనంతకృష్ణశర్మ మంగళగీతం పాడుటతో సభ ముగిసెను. మంగళవాయిద్యములతో పటములను ప్రాచ్యకళా పరిశోధనాలయానికి గొంపోయి అచట స్థిరముగనుంచిరి. గవర్నరు జనరలు రాజాజీగారు సభకు సందేశం పంపిరని తెలిపిరి. తమ గ్రంథం అచ్చువేయించుటకు ఆంధ్రపత్రికవారు త్వరగ బ్లాకులు చేయించి యిచ్చినందుకు కృతజ్ఞత తెలిపిరి.

### దైవకృప

రాత్రి 11 గం. ఊరేగింపు ముగిసినాక, శ్రీ రా. అనంతకృష్ణశర్మగారు, పత్రికా ప్రతినిధులు, ప్రాచ్యకళాశాల విద్యార్థులు మున్నగువారు మరలివచ్చుచున్న స్టేషను వాను ఒక మలుపు తిరిగి కాల్వలో కుడి ప్రక్క చక్రాలు రెండుపడి బండి యించుమించు బోర్లపడెను. గాని దైవకృపవల్ల ఎవ్వరికి ఎట్టిప్రమాదము జరుగలేదు.

## మద్యపాన నిషేధంకింద శిక్ష

గుడివాడ, ఏప్రిల్ 4: ఈ పట్టణంలోని కలారి రామయ్య అనునతడు తనవద్ద 3/4 సీసా సారాయి ఉంచుకొనినట్లు తేలినందువల్ల స్థానిక జిల్లామేజస్ట్రేటు అతనికి 2 నెలలు కఠినశిక్ష విధించిరి.

గుడివాడ తాలూకా పోలీసులు, దొంగ సారాయి కాయుచున్న వారికి చేయబడుతోందని తెలిసి, సిబ్బందితో వెళ్లి సోదాచేయగా, సారాయి తయారుచేసే యంత్రం వగైరా పనిముట్లు, కొంతసారాయి పట్టుబడింది. యీ సందర్భంలో సత్రం నాగభూషణం, పడికోట నిర్మాణ్య, సామియేలు అను ముగ్గురు అరెస్టు చేయబడిరి.

* * *

చికాకోల్, ఏప్రిల్ 4: రామలాల్ సాగర్ అనే పాకిస్తానీవానిని చీపురుపల్లి తాలూకా బాహ్యణీనగరం రేంజి మద్య నిషేధ ఇన్స్పెక్టరు అతినివద్ద విస్కీ సీసా ఉన్నదని అరెస్టుచేసి చీపురుపల్లి సబ్ మాజిస్ట్రేటుయెదుట హాజరుపరచగా మాజిస్ట్రేటు అతనికి రు 20 లు జరిమానా విధించిరి.

దొంగ అక్కయ్యను దొంగసారాయి తయారుచేయుచున్నాడనే నేరం మీద రెండు మాసాలు కఠినశిక్ష విధించబడెను.

సప్ప గేటు గ్రామం కొప్పురాజు పెంటయ్య సెట్టియ్య అనునతనికి సారాయి తయారుచేయుచున్నందుకు మూడువారాలు కఠినశిక్ష విధించబడెను.

## "పాకిస్తాన్‌కు పఠాన్లే ముప్పు"

### సరిహద్దురాష్ట్ర మాజీ గవర్నరు కారో హెచ్చరిక

### బ్రిటిష్ యుద్ధ తంత్రంలో పాకిస్తాన్ ప్రాధాన్యం

లండన్, ఏప్రిల్ 6: పాకిస్తాన్ బలపడినప్పుడే భారతదేశం సురక్షితంకాగలదనీ, అట్లాంటిక్ ఒడంబడిక రాజ్యాలకు ఆయువు పట్టువంటి మధ్య ప్రాచ్య దేశాల పెట్రోలు గనుల రక్షణకూడా పాకిస్తాన్ బలంపైనే ఆధారపడివుంటుందనీ, ఇదివరలో సరిహద్దు రాష్ట్ర గవర్నరుగా ఉన్న సర్ ఒలాఫ్ కారో నేటిక్కడ రాయల్ ఎంపైర్ సొసైటీ సభలో ఉపన్యసిస్తూ చెప్పారు. పాకిస్తాన్ స్వయంగానైనా లేక అన్ని రాజ్యాలతో కలిసైనా హిందూ మహాసముద్ర ప్రాంతరక్షణకు పూర్తి బాధ్యత వహించాలని చెప్పారు.

హిందూమహాసముద్ర ప్రాంతరక్షణకు రెండు శ్రేణులున్నాయన్నారు. ఒకటి పశ్చిమ సింధుశాఖ—కరాచీ—క్వెట్టా రెండవది కాబూల్—పెషావర్.

అయితే ఇస్లాంమతం పేరుచెప్పి నచ్చ చెప్పటాలంటే పఠాన్లతో కుదరదు. నిత్యం అరాచకాన్ని కాంక్షించే పఠాన్లని వినియోగించడానికి దిక్కేదీ లేదు. పాకిస్తాన్‌కు ముప్పు తేగలిగేవారు పఠాన్లే.

ఆసియా మధ్యప్రాచ్యానికి దేశరక్షణ కార్యక్రమాల్లో పశ్చిమ సింధుశాఖ ఆయువుపట్టువంటిది. పశ్చిమావసర్లి యగు సింధుశాఖ తూర్పున బర్మా, మలయా దేశాలు ప్రమాదస్థితిలో ఉన్నందువల్ల వీని మధ్య దూరంలో ఉన్న భారతదేశం కేంద్రంగా ఒక ప్రాంతీయరక్షణ కూటాన్ని ఏర్పాటు చేసుకోవాలని సర్ కారో సూచించారు. బ్రిటిష్ పరిపాలకులు భారతదేశాన్ని ఈరీతిగానే ఉపయోగించినందువల్ల యుద్ధాలు భారతదేశాన్ని అంటలేదు.

దేశ విభజనకుముందు సరిహద్దు ప్రాంతంలో పఠాన్ల అల్లరులు విశాలభారత దేశానికి లక్ష్యం లేక పోయినది కాని ఇప్పుడు పాకిస్తానుకు అది ప్రధానిసమస్య అయి పోయింది.

ఇస్తాంబుల్ నుండి (రష్యాసరిహద్దున టర్కీ) కరాచీవరకు మధ్యప్రాచ్యాన్ని రక్షించడానికి ముఖ్యంగా ఒక ప్రాంతీయ రక్షణకూటం ఏర్పాటు అవసరమని కారో సూచించారు. మధ్య ప్రాచ్యంలోని పెట్రోల్ అట్లాంటిక్ ఒడంబడిక దేశాలకు ఆయువు పట్టువంటిది. కాబట్టి ఇట్టి ప్రాంతీయ రక్షణ కూటాన్ని అట్లాంటిక్ ఒడంబడిక దేశాలు అవసరంగా పరిగణించాలన్నారు.

## మాస్కోలో భారత చలన చిత్రం

మాస్కో, ఏప్రిల్ 6: "ధరిత్రీదేవి బిడ్డలు" అనే భారతచలనచిత్రం మాస్కోలో ప్రదర్శింపబడింది. రష్యాలో భారతీయచిత్రం ప్రదర్శించుటకిదే మొదటిసారి.

## ఆంగ్లో-ఈజిప్షియను సంధి సంభాషణలు

లండన్, ఏప్రిల్ 6: ఈజిప్టు ప్రధాన మంత్రి, ఇబ్రహీం అబ్దెల్ హాదీపాషాగారు ఆంగ్లో ఈజిప్షియన్ సంధిసంభాషణలు తిరిగి ప్రారంభించడానికి ఇది తగినసమయమనే విశ్వాసాన్ని ప్రకటించారు.

ఒకరి మీద మరొకరికి విశ్వాసం లేకపోవడమొక్కటే సంభాషణలు జరగడానికి ప్రతిబంధకంగా ఉన్నదని ఆయన "న్యూస్ క్రానికల్" కైయిరో విలేఖరి తో చెప్పారు. ఈ నమ్మకం కలిగితే శాశ్వత స్నేహ, సహకారాలపై ఆధారపడిన సంధిని చేసుకొనడం మానుకొనడానికి కారణం లేదని ప్రధాన మంత్రిగారు సూచించారు.

ఈజిప్షియన్ సాధారణ ఎన్నికలు వేసవిలో జరుగనున్నప్పుడు ఈ సంధి సంభాషణలను తిరిగి ప్రారంభించడం ప్రయోజనకరం గాదేమోనని కైయిరోలోని బ్రిటిష్ వర్గాలవారు అనుమానిస్తున్నారు.

## అణ్వస్త్రపు తాకిడి తిన్న పంది

వాషింగ్టన్, ఏప్రిల్ 6: మూడుసంవత్సరాలక్రితం బికినీలో జరిగిన అణ్వస్త్ర పరీక్ష సమయంలో మునిగిపోయిన ఒక ఓడ ప్రైన్స్ జన్‌లో ఒకపంది యున్నది. ఇది నాలుగుగంటలు తరువాత ఇది నీటిలోనుండి బయటకి తీయబడింది. జీవించినప్పటికీ అప్పటినుండా దీనికి అనేక విచిత్ర అనుభవాలున్నాయి. 311 నంబర్ కలిగిన ఈ పందిని సంయుక్త రాష్ట్రాల నౌకా సైన్యం విడుదలచేసింది. ఇదిఇప్పుడు వాషింగ్టన్ జంతు ప్రదర్శనశాలలో ఉన్నది. దానికి చాలాకాలం చికిత్స చేయబడింది. పూర్తిగా రక్తం తీసివేయబడి, క్రొత్తరక్తం కూడా ఎక్కించబడింది.

## కాంగ్రెస్ యువజన సంస్థ

### ఐదుగురు సభ్యుల కమిటీ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: అఖిలభారత జాతీయకాంగ్రెస్ యువజనవ్యవహార కేవలం నిర్మాణాత్మక కార్యక్రమమే ప్రధానముగాగల ఒక యువజనసంస్థను నిర్మించుటకుగాను, కాంగ్రెస్ కార్యవర్గము ఐదుగురు సభ్యులతో ఒకసంఘాన్ని నియమించి నది. శంకర్‌రావ్ దేవ్, యస్. కె. పాటిల్, గోకుల్‌భాయ్‌భట్, జగ్జీవనరాం, యస్. జి. రంగాచారులు యీకమిటీలో సభ్యులు.

వివిధకాంగ్రెస్ సంఘములు పంపిన నివేదికలను దృష్టిలో ఉంచుకొని, యువజనసంస్థ నిర్మాణం విషయమును కార్యవర్గము నర్చించినది. అఖిల భారత యువజనసంస్థ నొకదానిని నెలకొల్పుటకు మొదట పూనుకొన్నది శంకర్‌రావుదేవ్. జైపూర్‌లో కాంగ్రెస్ మహాసభ జరిగినప్పుడు, శంకర్‌రావ్ దేవ్ యువజన ప్రతినిధుల సమావేశ మొకటి ఏర్పాటుచేసి, యువజన సంస్థ స్థాపనావశ్యకతను గూర్చి ఆ సమావేశములో చర్చించెను. మహాత్మాగాంధీ నిర్వచించిన సూత్రములపై దేశాభ్యుదయ కృషిలో, యువక రాజకీయవేత్తలను, ముఖ్యముగా, విద్యార్థిసమాజమును యీ యువజనసంస్థ సంఘటితపరచగలదని కాంగ్రెస్‌వర్గములవారు విశ్వసించుచున్నారు. అయితే అఖిలభారత విద్యార్థి కాంగ్రెస్ స్థితి యేమవునో తెలియుటలేదు. క్రొత్త యువజనసంస్థ ఏర్పాటైన తరువాత యిందులో కాంగ్రెస్ భావములకు ప్రాతినిధ్యము వహించగలదని విద్యార్థి కాంగ్రెస్ చెప్పుకొనుచున్నది. కాని, క్రొత్త యువజనసంస్థను విద్యార్థి కాంగ్రెస్ అనుబంధసంస్థగా తయారుచేయుట జరుగవచ్చు. రాజ్యాంగపరిషద్యక్షుని పంపుటకు కార్యవర్గం నిశ్చయించినది.

## భాషా రాష్ట్ర నివేదిక

### పరిషదధ్యక్షునికి పంపుటకు కార్యవర్గ నిర్ణయం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: భాషా రాష్ట్ర సమస్యపై కాంగ్రెసు అగ్రనాయకత్రయం తయారుచేసిన నివేదికను రాజ్యాంగ పరిషదధ్యక్షునికి పంపుటకు కాంగ్రెసు కార్యవర్గము నేడు నిశ్చయించినది.

## ఎ. ఐ. సి. సి. సమావేశం

### అధికార ప్రకటన

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశము మార్చి 21, 22 తేదీలలో డెరాడూన్‌లో జరుగునని నేడు అధికార రీత్యా ప్రకటింపబడెను.

## భారతదేశానికి పాకిస్తాన్ బుణం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: భారతదేశంలో బ్రిటిష్‌వారు విడిచిపెట్టిన ఆయుధ సామగ్రి ఫ్యాక్టరీల పరంగా చెల్లించవలసిన ధనంలో పాకిస్తాను చెల్లించవలసిన రూ 13 కోట్ల 76 లక్షలను పాకిస్తాన్‌లో విడిచిపెట్టిన సామగ్రిపంపంగాక 3 కోట్ల 23 లక్షలను భారత ప్రభుత్వంకు చెల్లించుటకు అంగీకరించినది. కరాచీ అంతర్ధనివేశ సమావేశములో జరిగిన ఒడంబడిక ననుసరించి భారతప్రభుత్వం ముందుగా చెల్లించుటకును, తరువాత పాకిస్తాన్ భారతప్రభుత్వమునకు చెల్లించుటకును అంగీకరించబడినది. ఇంతవరకు పాకిస్తాన్ భారత ప్రభుత్వానికి రు 2½ కోట్లుమాత్రం చెల్లించినది. ఒడంబడికను అమలుజరుపుటకు పాకిస్తాన్ అభ్యంతరము తెలుపలేదు కాని కొన్ని చిక్కులున్నవని తెలిసినది. ఆచిక్కులను భారతప్రభుత్వం పరిశీలించుచున్నది. త్వరలో జరుగబోవు అంతర్ధనివేశ సమావేశములో ఇది తిరిగి చర్చించబడగలదు.

## భారతసైన్యంలో బ్రిటిష్ ఉద్యోగులు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: భారత సైన్యంలో బ్రిటిష్ ఉద్యోగులు మొత్తం 197 మంది ఉన్నారని, వీరిలో 121 మంది, టెక్నికల్ శాఖలలో పనిచేస్తున్నారని, రక్షణమంత్రి సర్దార్ బల్‌దేవ్ సింగ్, శ్రీ వి. కామత్ ప్రశ్నకు సమాధానము నిచ్చెను.

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వములక్రింద ఇండియన్ సివిల్, ఇండియన్ నిర్వాహక శాఖలలో ఇంకా ఎంతమంది యూరోపియనులు పనిచేయుచున్నారని గాలా రాజాపర్వాన్‌సింగ్ అడిగిన ప్రశ్నకు సమాధానమిస్తూ, కేంద్రప్రభుత్వంక్రింద ముగ్గురు, రాష్ట్రప్రభుత్వములక్రింద ఐ. సి. యస్‌లో 19 మంది, పోలీసు సర్వీసులో ఒకడు, పనిచేయుచున్నారని సర్దార్ వల్లభాయిపటేల్ తెలియజేసెను.

# "రష్యన్ ప్రభుత్వాన్ని కూలద్రోయండి"

## రష్యన్ సింహాసనవారసుని ప్రకటన

రోమ్, ఏప్రిల్ 5: రష్యాలోని బోల్షెవిక్ ప్రభుత్వమును కూలద్రోయుటకు ప్రపంచములోని రష్యనులందరూ ఏకముకావలెనని రష్యన్ సింహాసన వారసుడనని చెప్పుకొనుచున్న రోమనోవ్ వంశీయుడు వ్లదిమీర్ ప్రభువు నేడు ఒక ప్రకటన చేసెను.

సోవియట్ ప్రభుత్వంకంటె క్రూరమైన ప్రభుత్వం ... గాని కార్మికవర్గపు ప్రభుత్వంగాని ప్రపంచంలో పుట్టలేదనీ, రష్యనుల నాశనమునకు కారకమైన ఆ పార్టీ నియంతలను అజేయులని అనుకోనుట పొరబాటనీ కూడ అతడు చెప్పుచున్నాడు.

## జర్మనీ పశ్చిమ సరిహద్దు సవరణపై రష్యా అధిక్షేపణ

మాస్కో, ఏప్రిల్ 5: జర్మనీ పశ్చిమ సరిహద్దును అక్రమంగా మార్చివేసినందుకు బ్రిటన్‌లోని రష్యా రాయబారి బ్రిటిష్ విదేశాంగ కార్యాలయమునకు ఒక అధిక్షేపణను అందజేసెను. అమెరికా, ఫ్రాన్సుల విదేశాంగ కార్యాలయములకు కూడా ఇటువంటి అధిక్షేపణ పత్రములు అందజేయబడెను.

పశ్చిమ సరిహద్దు సవరణవల్ల హాలెండుకు 26 చదరపుమైళ్ల వైశాల్యంగల భూమి, బెల్జియమ్‌కు 17 చదరపుమైళ్ల వైశాల్యంగల భూమి వచ్చింది.

## సుక్కూరు ఆనకట్ట మరమ్మత్తు

కరాచీ, ఏప్రిల్ 5: సింధురాష్ట్రంలోని సుక్కూరు ఆనకట్టను మరమ్మతు చేయుటకు రష్యాలోని డ్నీపర్ ఆనకట్టను నిర్మించిన సోవియట్ ఇంజనీరింగు నిపుణులను కూడ సంప్రదింపబడవచ్చునని తెలియుచున్నది.

# "పసిఫిక్ రక్షణ ఒడంబడిక సంగతి బ్రిటన్‌కేమీ తెలియదు"

## బ్రిటిష్ విదేశాంగశాఖోద్యోగి ప్రకటన

లండన్, ఏప్రిల్ 6: పసిఫిక్ రాజ్యాలమధ్య ఒక రక్షణ ఒడంబడికను కుదుర్చుటకు ప్లానులు వేయబడుచున్న సంగతి బ్రిటన్‌కేమీ తెలియదు, బ్రిటిష్ విదేశాంగ శాఖోద్యోగి ఒకడు నేడు వెల్లడించాడు.

పసిఫిక్ రాజ్యాలరక్షణ ఒడంబడిక విషయం గాని, హిందూ మహాసముద్ర ప్రాంతీయరాజ్యాల రక్షణ ఒడంబడిక విషయంగాని, భారత దేశానికి యేమీ తెలియదని, నిన్న భారతప్రధాని పండిట్ నెహ్రూ చేసినప్రకటనపై వ్యాఖ్యానిస్తూ యీ ఉద్యోగి యీ పైవిధంగా వెల్లడించాడు.

మధ్యధరా ప్రాంత రక్షణ ఒడంబడిక విషయమేమిటని అడుగగా బ్రిటిష్ విదేశాంగమంత్రి బెవిన్, టర్కీ, గ్రీస్ విదేశాంగమంత్రులు యీ సంవత్సరారంభమున లండన్‌లో ఈ విషయం చర్చించారని, అయితే మధ్యధరా రక్షణ ఒడంబడిక సంప్రదింపులు యిప్పటికింకా ప్రారంభం కావని ఈ ఉద్యోగి అన్నాడు.

## టర్కీకి అమెరికా 26 మిలియన్ల డాలర్ల సహాయం

వాషింగ్‌టన్, ఏప్రియల్ 5: టర్కీలో రోడ్ల నిర్మాణమునకు, రేవు సౌకర్యాల అభివృద్ధికీ, గనుల ఉత్పత్తి అభివృద్ధికీ మార్షల్ సహాయనిధి నుండి 26 మిలియన్ల డాలర్లను ఖర్చు పెట్టదమనీ, దీనివలన టర్కీ ఆర్థికవ్యవస్థ బాగుపడుననీ అమెరికన్ ఆర్థిక సహకార కార్యక్రమ సంఘం వారు నేడు ప్రకటించిరి.

## డెహ్రాడూన్ జిల్లాలో రాష్ట్రపతి పట్టాభి సంచారం

లక్నో, ఏప్రిల్ 6: ఏప్రిల్ రెండవ వారంలో కాంగ్రెస్‌లోని గురుకులంలో డా॥ పట్టాభి సీతారామయ్యగారు స్నాతకోపన్యాసము నివ్వనున్నారు. ఆయన ఏప్రిల్ 13 కు హరిద్వారము చేరుకొనును. వారి సంచారమునకు డెహ్రాడూన్ జిల్లా కాంగ్రెసుకమిటీ సౌకర్యములను కలుగజేయుచున్నారు.

## డా॥ రాజేంద్రప్రసాద్

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: గాంధీస్మారకనిధి సేకరణార్థం బీహారులోను, గ్వాలియరులోను, పర్యటించిన డా॥ రాజేంద్రప్రసాదు నేటి ఉదయం ఇచ్చటకువచ్చెను. నేడు ఆయన కాన్పూరుకు విమానములో వెళ్లి, కాన్పూరు, అజంఘర్ సహారన్పూర్, హరిద్వార్ లలో పర్యటించును.

## సేట్ గోవిందదాస్ ఆంధ్రదేశ పర్యటన

గుంటూరు, ఏప్రిల్ 6: భారత రాజ్యాంగ పరిషత్తు సభ్యులును, అఖిలభారత హిందీ సాహిత్య సమ్మేళనాధ్యక్షులును అగు సేట్ గోవిందదాసుగారు భాషావివాదమును గూర్చి ప్రచారం చేయుటకుగాను యీ నెల చివరి వారంలో యీ క్రింది కార్యక్రమం ప్రకారం ఆంధ్రదేశంలో పర్యటించనున్నారు. 23 న రాజమహేంద్రవరం, 24 న విజయవాడ, 25 గుంటూరు, 26 తెనాలి, 27 బాపట్ల, 28 నెల్లూరు, 29 గూడూరు, 30 చెన్నపట్నం.

## హిందీ పోటీ పరీక్షలు

విశాఖపట్నం, ఏప్రిల్ 4: స్థానిక మహిళా భవనంలో మొన్న సాయంకాలం, అక్కడి హిందీపాఠశాల నడుపుచున్న శ్రీమతి లీలావతమ్మ, విశారద, శ్రీమతి కంకణాల సత్యనారాయణమ్మ అధ్యక్షత క్రింద హిందీ పోటీ పరీక్షలు జరిగినవి. మొదటి తరగతిలో కె. రమణసుందరి ప్రథమబహుమానం, సరస్వతి వంకవాలా ద్వితీయ బహుమానం, జి. లీలాసుందరి తృతీయబహుమానం లోకేశ్వరి ప్రత్యేక బహుమానం పొందిరి. రెండవతరగతిలో గంగాబాయి ప్రథమబహుమానం, సీతామహాలక్ష్మి ద్వితీయబహుమానం, ఎస్. సుందరమ్మ తృతీయ బహుమానం, టి. సుశీల ప్రత్యేక బహుమానం పొందిరి.

### కస్తూర్బా పఠనమందిర వార్షిక సమావేశం

విజయనగరం, ఏప్రిల్ 6: స్థానిక కస్తూర్బా పఠనమందిర వార్షిక సర్వసభ్య సమావేశం నిన్న రాత్రి శ్రీ రామమూర్తిగారి అధ్యక్షతన జరిగింది. కొత్త సంవత్సరానికి రాత్రి శ్రీరామమూర్తి అధ్యక్షులుగను, ... ... మూర్తి ప్రధాన కార్యదర్శిగను ఎన్నుకొనబడిరి.

# 20 వేల దొంగ రేషన్ కార్డులు

## కళ్యాన శరణాగత శిబిరంలో అధికారుల వశము

బొంబాయి, ఏప్రిల్ 6: కళ్యాన శరణాగత శిబిరములలో గలది కొలదిరోజులలో జరిగిన సోదాలమూలమున రేషనింగ్ ఇన్‌స్పెక్టర్లకు 20 వేల దొంగ రేషన్ కార్డులు దొరికినవి. ఇందువల్ల రాష్ట్రీయ ప్రభుత్వమువారికి మాసమునకు దాదాపు 4 లక్షల రూపాయలు మిగులును. ఈ శిబిరములలో నివసించుచున్న దాదాపు 85 వేల మందికి ప్రభుత్వమువారు ఉచితముగా రేషన్లిచ్చుచున్నారు.

## రాజస్థాన్ సమాఖ్య మంత్రివర్గం

జైపూర్, ఏప్రిల్ 6: రాజస్థాన్ నూతన మంత్రివర్గము రేపు శ్రీరామనవమిన ప్రమాణ స్వీకారంచేయును. ఈ మంత్రివర్గములో 10 మంది ఉందురు. శ్రీ రామనవమి రాజపుత్రులకు ముఖ్యమైన పర్వదినము. భారత ప్రభుత్వం ఒక రీజినల్ కమిషనర్‌ను నియోగించును. ఈయన, రాజప్రముఖుని సలహాదారుడుగాగూడా పనిచేయును.

## ధూమపానం అపాయకరం కాదా?

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: ధూమపానం హద్దు మీరినట్లయితేనే ఆరోగ్యానికి హాని కాని తనుమాత్రంగా అభ్యసించేవారికి అపాయకరంలేదని విదేశాలలో పరిశోధనలవల్ల తెలిసినట్లు ఆరోగ్యశాఖామంత్రి శ్రీమతి రాజకుమారి అమృతకౌర్‌గారు నేడు పార్లమెంటులో హెచ్. వి. కామత్‌గారి ప్రశ్నకు సమాధానమొసగుచూ చెప్పిరి.

# హైద్రాబాదు గ్రామంపై సాయుధ బందిపోటు దొంగల ముట్టడి

హైదరాబాద్, ఏప్రిల్ 6: సుమారు 15 మంది బందిపోటుదొంగలు, పిస్తోళ్లలో సాయుధులై, హైదరాబాద్‌కు 30 మైళ్ల దూరంలో వున్న కామారెడ్డిగ్రామములో, ఒక ధనికభూస్వామి దేశముఖ్ యింటిలో చొరబడి, దాదాపు రెండులక్షల కిమ్మతు విలువగల వస్తువులు నగదు రొఖ్ఖం తస్కరించుకొని పోయిరి. అపహరింపబడిన మొత్తంలో రొఖ్ఖం రెండులక్షల రూపాయలు ఉన్నవట. భూస్వామి దొంగలను ప్రతిఘటించ ప్రయత్నించగా దొంగలు 30 సార్లు కాల్పులుజరిపి పారిపోయినారట.

## హైదరాబాద్‌లో 4 వేల కమ్యూనిస్టుల అరెస్టు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: భారత ఉపప్రధాని సర్దార్ వల్లభాయ్ పటేల్ గారు నేడు పార్లమెంటులో హైదరాబాద్‌లోని కమ్యూనిస్టు ముప్పు ప్రస్తుతం అదుపులోకి వచ్చిందని చెప్పిరి.

అక్కడి కమ్యూనిస్టు బలమెంతో చెప్పుటకు సాధ్యంకాదని ఆర్. కె. సిధ్వాగారి ప్రశ్నకు సమాధానమిచ్చిరి. సంస్థానంలో ఇప్పటివరకు అరెస్టు చేయబడిన కమ్యూనిస్టుల సంఖ్య దాదాపు నాలుగువేలు. మిగిలిన వారందరు నిజాం పూర్వప్రభుత్వకాలంలో కడచి పోయిరి. కొంతమంది అజ్ఞాతవాసం గడపటానికి పోయిరి.

సిధ్వా:—కమ్యూనిస్టుల చర్యలవల్ల హైదరాబాద్‌లోని నల్గొండ జిల్లా వరంగల్లు జిల్లాలలో తీవ్రమైన కష్టాలూ, హత్యలు జరుగుచున్నా యన్నది నిజమేనా?

పటేల్:—పరిస్థితి చాల నెమ్మదిగా ఉండెను. కాని 1949 జనవరినుండి వేగంగా ప్రశాంతముకు వచ్చుచున్నది. కామత్ ప్రశ్నకు సమాధానంగా పోలీసు చర్య కాలంలో కమ్యూనిస్టులు, రజాకార్లు కలసి ఉన్నా రనటంలో సందేహం ఏమీ లేదు అని పటేల్ చెప్పిరి.

శ్రీమతి దుర్గాబాయి:—హత్య చేయబడినవారిలో స్త్రీ లున్నారా? స్త్రీలు అపహరింపబడిరా?

పటేల్:—కమ్యూనిస్టులు స్త్రీలను, పురుషులను రేవ ఏమీ తారతమ్యం లేదు. కమ్యూనిస్టులు స్త్రీని కేనైనా అపహరించారా అన్న విషయాన్ని పరిశీలించి విచారిస్తాను.

# సికింద్రాబాదు మున్సిపాల్టీలో రజాకార్ల విచారణ

సికింద్రాబాదు, ఏప్రిల్ 6: సికింద్రాబాదు మున్సిపాల్టీలో నియమింపబడిన ముస్లిం ఉద్యోగులలో రజాకారోద్యమములో చేరి హిందువులను హింసపెట్టినవారి నేరములను పరిశోధించుటకు నియమింపబడిన సంఘము నివేదికను ప్రభుత్వమున కందచేసినట్లు తెలియుచున్నది. లాయక్ అలీ మంత్రివర్గంలో స్థానిక స్వపరిపాలనా మంత్రిగానున్న రామచంద్రరెడ్డి మున్సిపల్ ఉద్యోగులలో హిందువులను హింసపెట్టుటకు, వారిపై నిఘావేసి నేరములు చెప్పుటకు ముస్లిం ఉద్యోగులను ప్రోత్సహించెననియు, ముస్లిం ఉద్యోగులను రజాకర్ దళములో చేరుటకు ప్రోత్సహించెననియు నివేదికలో చెప్పబడినట్లు తెలియుచున్నది. ముఖ్యముగా గున్నరు అప్పన్ సబార్డినేట్ గుమాస్తాలపై నేరములు మోపబడినవి. భారత ఏజంటు జనరల్ మున్షీగారి వద్దకు కాంగ్రెసు వాలంటీర్ల స్వాతంత్ర్యోత్సవదినమున, రైలుపై దాడిచేయుటకు వీరే మూలకారకులని, వీరిపై నేరము మోపబడినది.

## రోవెన్ హత్యకేసు

### మెహతా సాక్ష్యం

హైదరాబాద్, ఏప్రిల్ 5: రోవెన్ హత్యకు మద్దతిచ్చాడనే నేరంపై బ్రిగేడియర్ సయ్యద్ హబీబ్ అహమ్మద్‌ను విచారిస్తున్న మిలిటరీ న్యాయస్థానంలో, బొంబాయి పోలీసు సర్జన్ డా॥ హెచ్. యస్. మెహతా సాక్ష్యమిస్తూ, బీదర్ సగర ఒక గుంటలో, అస్థిపంజరం పక్కన పడిఉన్న పుర్రెను పరిశీలించినపుడు, హత్య చేయబడిన వ్యక్తి, ఎడమకణతపైన బహుశా రైఫిల్ కాల్చబడినట్లు, తెలుస్తూన్నదని, చెప్పాడు. అస్థిపంజరం పడిఉన్న స్థితిని చూస్తే, మృతకళేబరం జాగ్రత్తగా గుంటలో పెట్టబడినట్లు కన్పిస్తూన్నదేగాని, పారవేయబడినట్లు లేదని సాక్షి తెలియజేశాడు. రోవెన్‌ను కాల్చిచంపేటప్పుడు, అక్కడఉన్న మహమ్మద్ లుక్మాన్ గూడ న్యాయస్థానంలో సాక్ష్యమిచ్చాడు. ఇతడు రోవెన్‌పైకాపలాదారులలో ఒకడు.

## రజాకార్ బాధితులకు ఆర్థిక సహాయం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 6: భారత ఉపప్రధాని సర్దార్ వల్లభాయ్ పటేల్‌గారు నేడు పార్లమెంటులో రంగాగారి ప్రశ్నకు సమాధానమిస్తూ, హైదరాబాద్‌లో రజాకార్ల చర్యలవల్ల నష్టపడినవారికి, పరిహారం యివ్వాలనే సిద్ధాంతంమీద యివ్వబడుటలేదనీ, అగత్యమైనవారికి ధనసహాయం ఉచితంగా చేయబడుచున్నదని, చెప్పిరి. నష్టపడి పోయినవారికి సంస్థాన ప్రభుత్వం పునరావాస సౌకర్యాలు కలుగచేస్తున్నది.

## సయ్యద్ మహమ్మద్ అలంపై ఛార్జీ

హైదరాబాద్, ఏప్రిల్ 6: నిజాం సంస్థాన రైల్వే మాజీ జనరల్ మానేజరు సయ్యదు మహమ్మద్ అలంపై, అతని ఉత్తరువుల ననుసరించి కొంతమంది రైల్వే ఉద్యోగులు విధ్వంసక చర్యలు జరిపినారని, త్వరలో ఛార్జి పెట్టబడవచ్చునున్నది. అలంఖాన్, బీబీనగర్ మొదలైన అనేక చోట్ల వంతెనలు పడగొట్టుటకు అలం కారకుడనుకుంటారు. ఇతడు ప్రస్తుతం 'ఇంటి నిర్బంధం'లో నున్నాడు.

## హైదరాబాద్ ముస్లిం రాయబారులు

హైదరాబాద్, ఏప్రిల్ 6: అన్ని పార్టీలకు చెందిన ముస్లిం ప్రతినిధుల రాయబారవర్గమొకటి భారత ప్రధానిని దర్శించుటకు త్వరలోనే ఢిల్లీకి బయలుదేరును నట్లు తెలియుచున్నది.

ఈ ప్రతినిధులు ... కాంగ్రెస్ ... ఆజాద్‌ను కూడా సంప్రదించెదరు. వీరు భారతప్రధానికి ఒక విజ్ఞాపనను సమర్పించుకొందురు. ఈ ప్రతినిధివర్గ నాయకుడు హైదరాబాద్ మిలిటరీ గవర్నరును కలుసుకొని, తాము ఢిల్లీకి వెళ్ళి భారతప్రధానిని కలుసుకొనదలచినదీ వివరపరచెను.

ముస్లింల పునరావాసం, ప్రభుత్వ ఉద్యోగాలలో ముస్లింల ప్రాతినిధ్యం, పోలీసు చర్య అనంతరం అరెస్టు చేయబడిన ముస్లింలను రజాకార్ అనుమానముపై ... విడుదలచేయుట, ... మొదలగు విషయాలను గురించి భారతప్రధానితో, యీ రాయబారవర్గము చర్చించునని తెలియుచున్నది.

# రేడియో ప్రోగ్రాములు

## విజయవాడ

(ఏప్రిల్ 9 శనివారం)

ఉ. 7 తె. వార్తలు. 7-15 గీతావళి. కాకుమాను పుష్పవతీదేవి. 7-30 కోట రామకృష్ణయ్య సోదేలు. 8 ఇం. వార్తలు. 8-15 కోట రామకృష్ణయ్య సోదేలు. సా. 5-30 బొమ్మరిల్లు. పిల్లల కార్యక్రమం. పిలుపుపాట. పరిచయము. బొమ్మలపండుగ నాటిక. భూదేవి ప్రసంగము. కిలకిలలు. నక్క-తాబేలు పాట కథ. చిలుకపలుకులు. సెలవుపాట. 6 ఇం. వార్తలు. 6-10 స్థానిక వార్తలు. 6-20 కాకుమాను పుష్పవతీదేవి భాగీతాలు. 6-30. గ్రామస్థుల కార్యక్రమము (మదరాసునుండి) 7 తె. వార్తలు. 7-15 గ్రామస్థుల కార్యక్రమం (మదరాసునుండి) 7-30 ఉభయ కుశలోపరి. 7-45 మదరాసులోవలె. 9-30 గానసుధ రికార్డులు. 9-40 మదరాసులోవలె.

## మదరాసు (2)

7-15 సినిమా రికార్డులు. 7-30 జానకీ శివరామన్ పాట. 8-15 టాకీ రికార్డులు. 8-30 బాలానందం. పిల్లల కార్యక్రమం. మ. 1-0 మహిళామండలి కార్యక్రమం పెన్నెల పాటలలో—యుగాలగీతం. వాల్మీకి రామాయణంలోని స్త్రీ పాత్రలు—ప్రసంగం. సీతమ్మ అనవాళ్లు. జానపదము. మహిళాలోకం. వచ్చేవారపు విశేషాలు. మంగళం. 1-30 ఇం. వార్తలు. 1-40 సినిమా రికార్డులు. 1-50 తెలుగు వార్తలు. 2-15 పి ఆర్ పూర్ నిగాచ్చి. సా. 4-0 పిల్లల కార్యక్రమం ఇంగ్లీషు. 4-30 ఇం. వాయిద్యం. 5-30 ఆర్ పట్టమ్మాళ్ వీణ. 6-0 ఇం. వార్తలు. 6-10 స్థానికవార్తలు. 6-20 రికార్డులు. 6-30 గ్రామస్థుల కార్యక్రమం. నల్లూరు తెలుస్తే పంకి ఎంకి పాట. వ్యాఖ్యానము. ప్రస్తుత ఆచారపరిస్థితి. రేషనింగు అవసరకత. ప్రసంగం. కృషి చేయరా, కృషికగీతం. విశేషాలేమిటి. కబుర్లు 7-0 తెలుగు వార్తలు. 7-15 గ్రామస్థుల కార్యక్రమం (తిరిగి) ఉయ్యాలో నియ్యాలన. ప్రసంగం. ప్రకటనలు ధరలు. వాతావరణ వివరాలు. 7-30 శాంతాఆప్టే రికార్డులు. 7-45 పి. ఎస్. వేదాచలం పాట. 9-0 ఇం. వార్తలు. 9-15 మదరాసులో గ్రంథాలయోద్యమం ఆర్ జనార్దనరావు నాయుడు ఇం ప్రసంగం. 9-30 ఏ. ఐ. ఆ. 9-40 నిలయవిద్వాంసుల వాద్యం. 10-0 నృత్యసంగీతం.

## మదరాసు ధరలు

మదరాసు, ఏప్రిల్ 7:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎడ్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు. 73-0-0 పెట్లా బంగారు తులం 110-0-0 నూనబంగారు 108-8-0 సీమవెండి తులం 100-కి (రెడి) 176-0-0 వెండి తులం 1 కి 1-13-0.

### పంచదార

"ఉయ్యూరు" (2 అంవరు) రు 89-4-9

## విజయవాడ

విజయవాడ, ఏప్రిల్ 6:

| | |
|---|---|
| బులియను—బంగారం—పెట్లా | |
| తులం 1 కి | రు 110-0-0 |
| ,, ,, నూనా | రు 109-0-0 |
| ,, ,, సావరిను | రు 73-0-0 |
| వెండి 100 తులాలు | రు 176-0-0 |
| ,, తులం 1 కి | రు 1-13-0 |
| వేరుశనగపప్పు-177 పౌనుల | |
| బస్తా—దేశవాళీ (పంచికాక) | రు 56-4-0 |
| ,, ,, స్పానిష్ రకం | రు 55-4-0 |
| వేరుశనగనూనె-35 పౌనుల | |
| మరియు తయారు | రు 16-8-0 |
| ,, ,, మే వాయిదా | రు 16-10-0 |
| ,, ,, జూన్ వాయిదా | రు 16-12-0 |
| వేరుశనగ పిణ్ణా-155 పౌనుల | |
| బస్తా (పంచికాక) తయారుకు | 13-4-0 |
| ,, ,, మే వాయిదా | రు 14-4-0 |

### మే వాయిదా ధరలు

| | | |
|---|---|---|
| నేటి ప్రారంభం | పల | 82 36 |
| నిన్న | | 82 34 |
| ,, ముగింపు | పల | 82 33 |
| నిన్న | | 82 34 |

## నోటీసు

1945 మద్రాసు సిటీ యింప్రూవుమెంటు ట్రస్టు ఆక్టు 47 వ సెక్షన్ క్రింది నోటీసు.

ఇందు మూలమున తెలియపరచున దేమనగా, దిగువ దాఖలా షెడ్యూలులోని సరిహద్దుల లోపలనున్న ఏరియాను, మద్రాసు సిటి యింప్రూవుమెంటుయొక్క ట్రస్టీలబోర్డువారు యింప్రూవుమెంటు స్కీమును తయారుచేసియున్నారు.

2. దిగువ డాక్యుమెంట్లతోసహా, స్కీము తాలూకు వివరములన్నియు, మద్రాసు, నెం. 160 వ మౌంట్‌రోడ్ నందలి బోర్డు ఆఫీసునందు ఆఫీసు రోజులలో యెప్పుడైనను ఉ॥ 11 గం. లు మొదలు సా॥ 5 గం. ల వరకు, ఉచితముగా చూడవచ్చును.

(a) స్కీముయొక్క డ్రాఫ్టు ప్లానులు

(b) స్కీములో చేరిన ఏరియా మ్యాపు (ప్లాన్ నెం. 1)

(c) ఏరియా లేఔటు (ప్లాన్ నెం. 2)

(d) ఉద్దేశించిన బిల్డింగుల ప్లానులు (ప్లానులు, 3,4)

పై 2 వ పేరాలో చెప్పబడిన వరకుగల అయిటములలో తెలిపిన స్కీము నిర్మాణము యొక్క డాక్యుమెంట్ల కాపీలు, రు 2/-లు (రెండు రూపాయలు మాత్రం) చెల్లించి, చేర్మన్‌గారివద్దనుంచి పొందవచ్చును.

స్కీములోనున్న ప్రయోజనకర స్థల ఆక్షేపణలున్నయెడల, బోర్డు చేర్మన్‌గారికి 10-6-49 లోపల వ్రాతమూలకముగా పంపుకొనవలెను.

షెడ్యూలు:

ఏరియాకు హద్దులు:

ఉత్తరం: జార్జి టౌన్ ఆర్. ఎస్. నెం. 11879/1, 11712 భాగము

తూర్పు: ఆర్. ఎస్. నెం. 11712 జార్జి టౌన్, భాగము (మ్యూనిసిపల్ రోడ్డు) ...

...: ప్రకాశం ... (ఆర్. ఎస్. నెం. 11713, జార్జి టౌన్ 10120 భాగము)

పడమర: ఎస్ప్లనేడ్ రోడ్డు. (ఆర్. ఎస్. నెం. 11879 ఎస్ప్లనేడ్ భాగము)

మద్రాసు సిటీ యింప్రూవుమెంటు ట్రస్టుల బోర్డు తరఫున, నాచే ఈ 1949 ఏప్రిల్ 2 వ తేదీన జారీచేయబడినది.

మద్రాసు 2-4-49 — కే. కే. నంబియార్, బోర్డు చేర్మన్.

# రాష్ట్ర నూతన మంత్రుల ప్రమాణస్వీకార దృశ్యాలు

డా॥ రాజన్

శ్రీ భక్తవత్సలం

శ్రీ కె. చంద్రమౌళి

శ్రీ బి. గోపాలరెడ్డి

శ్రీ నీలం సంజీవరెడ్డి

శ్రీ హెచ్. సీతారామరెడ్డి

శ్రీ ఏ. బి. షెట్టి

శ్రీ కె. మాధవమీనన్

శ్రీ బి. పరమేశ్వరన్

## 'చైనా ప్రభుత్వ సేన పూర్తిగా దాసోహమనాలి'

### కమ్యూనిస్టు రేడియో హెచ్చరిక

నాన్‌కింగ్, ఏప్రియల్ 6: సంధి ఒడంబడికకు లోబడకుండా చైనా జాతీయ ప్రభుత్వసేనలు పూర్తిగా దాసోహమనవలసినదేననీ, పీపింగ్ కమ్యూనిస్టు రేడియో నేటిరాత్రి ప్రకటించినది.

కొమింటాంగ్ సేనలు పూర్తిగా దాసోహమనడమే శాంతిస్థాపనకు శరణ్యమని, రాజీమార్గానికెక్కడా తావులేదని కమ్యూ రేడియో హెచ్చరిక చేసినది.

"దాసోహం ప్రజలకు, దేశానికీ క్షేమదాయకము దేశానికి ప్రజలకు ఉత్తమ సేవచేయుటకు మీకు మేము తుది అవకాశమిస్తున్నాము."

కొమింటాంగ్ దోపిడీగాం ప్రజను తుడిచిపెట్టుటకు, కమ్యూనిస్టు సేనలు యాంగ్‌ట్సీనది దాటుటకు సర్వసన్నద్ధంగా ఉన్నవి. కొమింటాంగ్ ప్రభుత్వం సంధి రాయబారాలలో చిత్తశుద్ధి లేకుండా ఉన్నారు. మరొకయుద్ధానికి సన్నాహం చేస్తున్నారు." అని పీపింగ్ కమ్యూనిస్టు రేడియో ప్రకటించింది.

15 రోజులలో కమ్యూనిస్టుసేనలు నది దాటిరాగలవని తను అనుకొంటున్నట్లు చైనా అధ్యక్షుడు లీసుంగ్ జెన్ నాన్‌కింగ్ రాజకీయ తంత్రవాదులకు చెప్పినట్లు షాంగ్‌హై వర్గాలద్వారా తెలియవచ్చినది.

కమ్యూనిస్టులు పీపింగ్‌లోని ప్రభుత్వ రాయబారవర్గానికి యించుమించు ఒక అంత్య సందేశం యిచ్చారని, ప్రభుత్వ సేనలు పూర్తిగా లొంగిపోవాలని యీ సందేశంలో కమ్యూనిస్టులు కోరినారని యీ వర్గములవారు చెబుతున్నారు.

### శాంతిచర్చల భగ్నత?

నాన్‌కింగ్, ఏప్రిల్ 6: నాన్‌కింగ్‌కు తూర్పుగా 80 మైళ్ళదూరాన ఇచెంగ్ వద్ద చైనా కమ్యూనిస్టులకు ప్రభుత్వసేనలకు మధ్య భీకరపోరాటం సాగుతున్నది. కమ్యూనిస్టు అధికారులు తమ సేనలకు యుద్ధవిరమణ ఉత్తర్వుజారీ చేస్తారన్నారే ఇంతవరకు ఆ ఉత్తర్వులే వెలువడలేదు. యాంగ్‌ట్సీ తీరంనుంచి కమ్యూనిస్టుసేన ఉపసంహారం జరుగుతున్నదనే వార్తకూడ వచ్చింది. పీపింగ్‌లో జరుగుతున్న శాంతిచర్చలపట్లను మింటాంగ్ పార్టీ అభిప్రాయాన్ని వ్యక్తపరిచే వార్తలు రాకపంలేము గతరాత్రి పీపింగ్‌లోని కమ్యూనిస్టు రేడియో చైనా ప్రభుత్వ ధోరణిని ఖండించి తమసేనలు యాంగ్‌ట్సీనదిని దాటితీరగలవని హెచ్చరిక చేసింది.

మొత్తంమీద పీపింగ్ శాంతిచర్చలు మరింత ప్రమాదంగా తయారైనట్లే తెలుస్తున్నది.

షాంఘైలు అమెరికన్ యాజమాన్యాన నడిచే ఈవెనింగ్ పోస్టుపత్రిక శాంతిచర్చలు ఇంచుమించు భగ్నమైనట్లేనని ప్రకటించినది కమ్యూనిస్టుల అసందర్భపు కోర్కెలే ఇందుకు కారణమట.

### అమెరికా ద్రవ్యసహాయము

వాషింగ్టన్, ఏప్రిల్ 6: చైనా సైనిక సహాయమునకుగాను ప్రత్యేకింపబడిన మొత్తములో ఆఖరు మొత్తము 12 కోట్ల 50 లక్షల డాలర్లు ఏప్రిల్ 1 తేదీ నాడు చైనీస్ ప్రభుత్వ హస్తగతము గావింపబడెనని అమెరికా విదేశాంగ శాఖవారు నేడు ప్రకటించిరి

## హాలెండుకు అమెరికను సహాయము నిరాకరించవలెను

### సెనేటర్ ఫ్రాంగ్‌గ్రాహం సూచన

వాషింగ్టన్, ఏప్రిల్ 5: ముందుజరుపదలచుచున్న ఇండోనీసియన్ రాజీసంభాషణలలో డచ్చివారు త్వరగా పాల్గొనక పోయినయెడల నెదర్లాండ్సుకు అమెరికను సహాయము ఆపుచేయవలెనని సెనేటర్ ఫ్రాంక్ గ్రాహం నేడు సూచికచేసెను. నిజవిషయములను కనుగొనుటకు, రెండు సంవత్సరములక్రిందట ఈస్టిండీసుకు వెళ్లిన రాయబారవర్గములో ఈతడు సభ్యుడు. ఈయన డచ్చి-ఇండోనీసియన్ వివాద విషయమై సెనేటుకు 69 పేజీల నివేదిక నంపియున్నాడు.

భద్రతాసంఘ ఉత్తరువులను, ప్రార్థనలను శిరసావహింపని దేశములకు మార్షల్ పథకములో నిర్దేశింపబడిన ద్రవ్య సహాయమును నిరాకరించవలెనని సెనేటర్ బ్రూస్టరు సూచించియున్నాడు.

ఐక్యరాజ్యసమితి యుద్ధవిరమణ ఉత్తరువులను హాలెండు శిరసావహించునవరకు హాలెండుకు మార్షల్‌పథక సహాయమును నిరాకరించవలెనని సెనేటర్ బ్రూస్టర్ గావించిన సూచనకు సెనేటర్ గ్రాహం సుముఖముగా నున్నప్పటికి దీనిని ఇండోనీసియలో ప్రారంభించుట కిది సరయైన సమయముకాదని తెలుపుచున్నాడు. డచ్చివారి, వాగ్దానములు ఇండోనీసియనుల వాగ్దానములు నమ్మదగినవికావని తేటపడినయెడల ఈ విషయమును తరువాత విచారించవచ్చునను చున్నాడు.

నెదర్లాండ్సు ప్రభుత్వము విషయమై సెనేటర్ గ్రాహం ప్రస్తావించుచు 'ఇండోనీసియా ప్రపంచముయొక్క ముందువాకిలిలో నున్నది. హాలెండుస్వంత పెనుకపెరడులో లేదు' అని చెప్పుచున్నాడు.

## ఇండో చైనాలో సంఘర్షణలు

పారిస్, ఏప్రిల్ 5: టాంకింగ్ (ఇండో చైనా)లోని హానోయ్ ప్రాంతంలో నిన్న జరిగిన సంఘర్షణలలో ఫ్రెంచి సైన్యము 43 గురు వియట్‌మిన్ సైనికులను చంపివేసెనని నేడిక్కడ ఫ్రెంచివార్తా సంస్థ ప్రకటించెను.

హానోయ్-హైఫాంగ్ రోడ్డుతో ఎర్రనదిని కలిపే ఆసకట్టపైగల ఫ్రెంచి సైనిక స్థావరమును కొన్ని వందలమంది వియట్‌మిన్ సైనికులు ముట్టడింపగా ఫ్రెంచివారు టాంకులతో ఎదిర్చిరనీ, అప్పుడు 35 గురు వియట్‌మిన్ సైనికులు మరణించిరనీ, ఫ్రెంచివారి సేనలు గాయపడినవనీ, ఈ ప్రాంతములో మిలిటరీ చర్యలు ఇంకా చాల రోజులవరకూ కొనసాగుననీ సైగాన్ వార్తలు తెలుపుచున్నవనికూడ ఫ్రెంచివార్తా సంస్థ ప్రకటించెను.

## మంత్రివర్గాన్ని విస్తృతంచేయడం త్వరలో జరుగునని శ్రీ కుమారస్వామిరాజా ప్రకటన

### "ఉపమంత్రులనుగాని, పార్లమెంటరీ సెక్రటరీలనుగాని నియమించే విషయం కూడా ఆలోచనలో ఉంది"

చెన్నపట్నం, ఏప్రిల్ 7: ప్రమాణస్వీకార కార్యక్రమం పూర్తికాగానే, అక్కడ వేచియున్న పత్రికా విలేఖరులకు శ్రీ కుమారస్వామి రాజా ఈ క్రింది లిఖిత ప్రకటనను అందచేసిరి: "తన ఆరోగ్య కారణంగా డాక్టర్ టి. యస్. యస్. రాజన్‌గారు మంత్రివర్గంనుండి విరమింపదలచిరని చెప్పవలసియున్నది. నా మంత్రివర్గములో చేరి, ఆయన అపార అనుభవ ప్రయోజనమును నా మంత్రివర్గమునకును లభింప చేయవలసిందని నేను కోరగా, వారు నా కోర్కెను మన్నించిరి.

"కొన్ని ప్రాంతాలకు కొన్ని వర్గాలకు ప్రాతినిధ్యం లభించుటకు వీలుగా అనతి కాలంలోనే మంత్రివర్గమును విస్తృతం చేయ తలచినాను. ఉప మంత్రులనుగాని, పార్లమెంటరీ కార్యదర్శులనుగాని నియమించే విషయం కూడా ఆలోచనలో ఉన్నది."

ప్రమాణస్వీకారం చేస్తున్న ప్రధాని కుమారస్వామిరాజాగారు

### నూతనప్రధాని విన్నపం

మద్రాసు ప్రధాని కుమారస్వామి రాజాగారు పత్రికలవారికీ క్రింది సందేశము నిచ్చిరి:—ప్రభుత్వమునకు పత్రికలవారి సహాయము అవసరమని ఆశించుచున్నాను. మద్రాసు పత్రికలకు, ప్రభుత్వమునకు ఉన్న సౌహార్ద సంబంధములు నాకు తెలియును. ఈ స్నేహము సందమరింత సుఖకరముగా ముందు విలసిల్లగలదని ఆశించుచున్నాను. ప్రభుత్వము, సరసమూ, నిష్పక్షమూ అయిన విమర్శను ఆహ్వానించుచున్నది. శాంతి భద్రతల నెలకొల్పుటలోనూ, విచ్ఛిన్న శక్తుల నెదుర్కొనుటలోను పత్రికలవారు సహాయము చేయుట ఎంతయు అవసరము.

ప్రజాసేవయే పరమధర్మముగా. ఉద్యోగులు ఎంచుకొని అనిర్ద్వంద్వమైన సహాయమును ప్రభుత్వమునకు అందచేయవలెను.

ఆహార సమస్యను ముందు మన మెదుర్కొనవలెను. ప్రధాన సమస్యల నెదుర్కొనుటలో ప్రజ లందరియొక్క సహకార స్నేహ సహాయ సంపత్తులను నేను అర్థించుచున్నాను. మన కందరకూ భగవంతుడు తోడ్పడుగాక!

కుమారస్వామి రాజాగారు ప్రభుత్వ విధానము ఏమైన మారునా అని పత్రికలవారు అడుగగా "ప్రధాని మారినంత మాత్రమున, విధానము మారవలసిన అవసరములేదు కాంగ్రెసు వారలందరి విధానము కాంగ్రెసు నిర్వచించిన విధానమే" అని చెప్పిరి.

### సంజీవరెడ్డిగారి వాగ్దానం

పత్రికలవారు సంజీవరెడ్డిగారిని సంవర్శించగా "రాష్ట్ర ప్రజ లందరకు నాశాయశక్తులా సేవ చేసెదను. రాయలసీమ ఆర్థికాభివృద్ధికి అత్యంతము పాటుపడెదను" అని చెప్పిరి.

### ప్రమాణస్వీకార దృశ్యాలు

చెన్నపట్నం, ఏప్రిలు 6: నేడు మధ్యాహ్నము ప్రధాని కుమారస్వామిరాజా, మంత్రులు డా॥ రాజన్, భక్తవత్సలం, గోపాలరెడ్డి, మాధవమీనన్, సీతారామరెడ్డి, ఎ. బి. షెట్టి, కల్లూరి చంద్రమౌళి, పరమేశ్వరన్, నీలం సంజీవరెడ్డిగారలు ఫోర్టుసెంట్ జార్జికాబినెట్ మందిరమున మంత్రులుగా ప్రమాణము గైకొనిరి. మద్రాసు గవర్నరుగారు వారందరిచేత పక్షపాతములేకుండా సర్వజనులను సమదృష్టితో పాలింతుమని రాజ్యాంగానురక్తి ప్రమాణమును, చేయించిరి. ప్రత్యేకాహ్వానముపై కొందరు ప్రమాణము సభ నలంకరించిరి.

శ్రీ కుమారస్వామిరాజాగారు సరిగా 2 గం॥ 53 నిముషములకు మంత్రి మందిరమునకు వచ్చిరి. వెంటనే అప్పుడే వచ్చిన స్పీకరు శివషణ్ముగంపిళ్లై, ప్రెసిడెంటు రామకృష్ణంరాజుగారలు వారి నభినందించిరి. అపై కల్లూరి చంద్రమౌళి, భక్తవత్సలం, పరమేశ్వరన్, డాక్టర్ రాజన్ గారలు వచ్చి వారి వారి స్థానములందు ఆసీనులైరి. అందరికన్న ఆఖరున నీలం సంజీవరెడ్డిగారు వచ్చిరి. మంత్రులందరు మొదటి, రెండువరసల కుర్చీలలోనువుండిరి. మేయరు, షెరిఫ్, ప్రభుత్వ కార్యదర్శులు, శాసన సభ్యులు వారివెనక కూర్చొనిరి. శాసన సభ్యులు టి. కె. టి. ఎల్. ఆర్. తాతాచారి, గోన సీతారామస్వామి, జమరామిరెడ్డి, పండు లక్ష్మణస్వామి, న్యాయపతి నారాయణమూర్తి, అన్నాప్రగడ కామేశ్వరరావు, జి. వెంకటరెడ్డి, శ్రీమతి అమ్మన్నరాజా, మంతెన వెంకట్రాజు, అల్లూరి సత్యనారాయణ రాజు, నూకల వీరరాఘవయ్యగారలు సభలో ఉండిరి.

మూడు గంటలగుసరికి గవర్నర్ భావసింగ్జీ కృష్ణసింగ్జీగారు 3 గంటల అనంతరము సభలోకి వచ్చునరికి సభ్యులందరు నిలబడిరి. అభివందన ప్రత్యభివందనానంతరము చీఫ్ సెక్రటరి రాముణ్ణిమీనన్ గారు ప్రధానిని గవర్నరుకు ఎరుకపరచిరి. ప్రధాని తన సహచరులందరినీ గవర్నరుకు ఎరుకపరచిరి. తర్వాత గవర్నరుగారు ప్రధాని కుమారస్వామి రాజాగారిచేత ప్రమాణ స్వీకారము చేయించిరి.

శ్రీ కుమారస్వామిరాజాగారు ప్రమాణము గైకొనుచూ భారతరాజ్యాంగానుసారము, భారత ధర్మశాస్త్ర సంప్రదాయానుసారము, వీతరాగద్వేష భయక్రోధరహితముగా నిష్పక్షపాతముతో వీరు వారను భేదభావములేకుండా సర్వజనులను సమదృష్టితో పరిపాలింతుననియు, అందు భగవంతుడు సహాయపడుగాక అనియు ప్రమాణము గైకొనిరి. మంత్రివర్గ రహస్యములను అవసరమైనంతవరకు తప్ప బయట పెట్టబోమని గూడా ప్రమాణము గైకొనిరి.

అదే విధముగా ప్రధాని అనంతరము డా॥ రాజన్, భక్తవత్సలం, బెజవాడ గోపాలరెడ్డి, మాధవమీనన్, సీతారామరెడ్డి, ఎ. బి. షెట్టి, కల్లూరి చంద్రమౌళి, పరమేశ్వరన్, సంజీవరెడ్డిగారలు ప్రమాణము గైకొనిరి. ప్రమాణము గైకొన్నమీదట శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు మరికొందరు సంజీవరెడ్డిగారిని వారిగదికి సాగనంపిరి. శ్రీ బాపినీడు, చీఫ్ సెక్రటరీ మున్నగువారు కుమారస్వామిరాజా గారిని వారిగదికి సాగనంపిరి. మాధవమీనన్ ప్రభృతులు పరమేశ్వరన్ గారి వారిగదికి గొనిపోయిరి.

### కొత్త మంత్రులకు అభినందనలు

శ్రీ పూసపాటి కుమారస్వామిరాజా గారు పూర్వము ఓమందూరు రామస్వామి రెడ్డిగారు కూర్చొనేగదిలో కూర్చొనిరి. పలువురు మిత్రులువారిని అభినందించిరి.

డా॥ రాజన్, భక్తవత్సలం, మాధవ మీనన్, సీతారామరెడ్డి, గోపాలరెడ్డి చంద్రమౌళి, సంజీవరెడ్డి, పరమేశ్వరన్ గారలను మంత్రిపదవీ స్వీకరణానంతరం పలువురు మిత్రులు అభినందించిరి.

ఓమందూరు రామస్వామి రెడ్డిగారు నేటిరాత్రి దక్షిణార్కాటుజిల్లా ఓమందూరు గ్రామమునకు కారులో వెళ్లుచున్నారు.

శ్రీ అవినాశిలింగంచెట్టిగారు కోయంబత్తూరు నేటిరాత్రి వెళ్లుచున్నారు.

శ్రీ నీలం సంజీవరెడ్డిగారు కొన్నాళ్లు ప్రభుత్వ అతిథిగృహమున విడిసి యుందురు.

మంత్రిపదవీస్వీకరణానంతరం శ్రీ నీలం. సంజీవరెడ్డిగారుపూర్వము కళా వెంకట్రావుగారు కూర్చుండే గదిలో కూర్చొనిరి.

బి. పరమేశ్వరన్‌గారు పూర్వము అవినాశిలింగం గారు ఉండినగదిలోకూర్... ఎ. బి. షెట్టిగారు కూంహానుకు Str... మార్చినారు. పరమేశ్వరన్‌గారు కోడంబాకం హైరోడ్డులో వెనక సుబ్బరాయన్ గారు ఉండే గృహములో బసచేయుదురు.

శ్రీ కుమారస్వామి రాజాగారు అడయారు బ్రాడీస్ కాజిల్ లో బస చేయుదురు.

### అదనపు మంత్రులు

ఇతర వర్గములనుండి వ్యక్తు లెవరైనా మంత్రివర్గమున చేర సంసిద్ధపడినచో నల్గురు తీసుకొనవడుదురని తెలియుచున్నది.

శ్రీ ప్రకాశం, కాశేశ్వరరావు, రంగాగారలు ఇప్పటి మంత్రులపై కొన్ని ఆరోపణలు ఉన్నందున పాతమంత్రుల కందరిపైన విచారణజరిపించి కొత్తమంత్రులను తీసుకొనవలసినదిగా ఒక విజ్ఞప్తిని కాంగ్రెసు అధ్యక్షులకు సమర్పించిరని తెలియుచున్నది. మంత్రివర్గ పక్షమువారు కొందరు శాసనసభ్యులు ప్రకాశం మంత్రివర్గ పరిపాలన వ్యవహారములగూడా విచారింపవలెనని మరొక విజ్ఞప్తిని సమర్పించిరి.

ఆంధ్రసభ్యులలో వ్యక్తులను కొందరిని కుమారస్వామి రాజాగారు ఆహ్వానించెదరనియూ వారుచేర సంకల్పించుచో చేర్చుకొందురనియూ అభిజ్ఞవర్గములవారు తెలుపుచున్నారు.

ప్రధాని రేపు ఢిల్లీ వెళ్లినపుడు అధిష్ఠాన వర్గముతో సంప్రదించెదరు. రాష్ట్రపతి పట్టాభిగారు ఈ నెల 19, 20 తేదీలలో చెన్నపట్నంవచ్చినపుడు మిగతామంత్రుల విషయము నిర్ణయింపబడునని అనుకొనుచున్నారు.

పాతమంత్రులలో విద్యామంత్రి అవినాశిలింగం చెట్టిగారు, గ్రామోద్ధరణమంత్రి వేముల కూర్మయ్యగారు, ఫిర్కాభివృద్ధి మంత్రి సుబ్బరాయన్ గారలు నేటినుంచి మంత్రిపదవినుండి విరమించుచున్నారు.

#### విందు

ఆర్. బి. రామకృష్ణంరాజుగారు ప్రధానికి, మంత్రులకూ అల్పాహారవిందు చేసిరి.

#### టెండరు

పశువుల ఆహారము 1949 జూన్ మొదలు ఒకసంవత్సరం సప్లయి చేయుటకు బళ్లారిజిల్లా, హొస్పేట్ పో. ఆ. లైవ్‌స్టాక్ రీసర్చి స్టేషన్, సూపరింటెండెంటుగారిచే 1949 ఏప్రిల్ 27 వ తేదీ సా. 3 గం. ల వరకు సీలువేసిన టెండర్లు కోరబడుచున్నవి. సదరు టెండర్లు 28-4-49 ఉ॥ 11 గం. లకు తెరవబడును.

రెండు ఫారముల సెట్టు 1 కి రు 1/- వంతున చెల్లించి, మొత్తముల షెడ్యూళ్లు, టెండరు ఫారములతో సహా, టెండరు షరతులు దినువసంతకముద్వారానండి పొందవచ్చును. టెండరుఫారము ఒకరిది మరియొకరికి మార్చుకొనగూడదు.

సి. కృష్ణారావు,
సూపరింటెండెంటు, లైవ్‌స్టాకు రీసర్చి స్టేషన్, హొస్పేట పో. ఆ. (బళ్లారిజిల్లా.)



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St. Madras.